Regd. No. HNL. 18

28.1.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 66, సంచిక: విడిప్రతి: రు. 2.00 లు

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



రాజ్యసభ సీట్లకు తన సిఫార్సులను ప్రధాని చెత్త బుట్టలో వేయడంతొని...

# ముఖ్యమంత్రికి మనస్తాపం!

రాజ్యసభ అభ్యర్థుల ఎంపికలో తన మాటచెల్లక ముఖ్యమంత్రి కోట్ల విజయ భాస్కర రెడ్డి భంగపడ్డారు. ముఖ్యమంత్రి అత్యుత్సాహంతో ఢిల్లీకి పట్టుకెళ్లిన జాబితాను ప్రధాన మంత్రి బుట్టదాఖలా చేసి తనే స్వయంగా అభ్యర్థుల్ని ఎంపిక చేశారు. దీనితో ముఖ్యమంత్రి నామమాత్రుడయ్యారు. ఊహించని ఈ పరిణామం ముఖ్యమంత్రిని మనస్తాపానికి గురిచేసింది. ఇటీవల ప్రధానమంత్రి రాష్ట్ర పర్యటన చేదు ఫలితాల ప్రభావం కారణంగా ముఖ్యమంత్రి అధికారాన్ని అధిష్టానం ఈ విధంగా నీరుకార్చింది. రాష్ట్రంలో మరో పదినెలల్లో ఎన్నికలు జరగాల్సి వుండగా ముఖ్యమంత్రికి అధిష్టానం వద్ద పట్టు తప్పటంతో రాష్ట్ర కాంగ్రెస్ రాజకీయాలు ముదిరి పాకాన పడే అవకాశాలున్నాయి. ముఖ్యమంత్రి జాబితాలో ఇప్పుడు ఎంపికైన అభ్యర్థులు ఒక్కరు కూడా లేరు. రాష్ట్ర మంత్రి శ్రీమతి లక్ష్మీదేవి, మాజీ ఎమ్మెల్సీ ఖురేషి, మాజీ మంత్రులు నారప రెడ్డి, పురుషోత్తమ రెడ్డి, పివి కొడుకు పి.వి. రాజేశ్వర రావుకు రాజ్యసభ టిక్కెట్లు ఇవ్వాలని ముఖ్యమంత్రి సిఫార్సు చేశారట. అయితే ప్రధాన మంత్రి ఈ పేర్లను కనీసం పరిశీలనలోకి కూడా తీసుకోలేదట. తన చిరకాల స్నేహితుడైన కె.ఎమ్. ఖాన్‌ను మైనారిటీ వర్గాల నుంచి ప్రధాని ఎంపిక చేశారు. అలాగే రాజ్యసభ సభ్యుడిగా వుండి చనిపోయిన టి. చంద్రశేఖర రెడ్డి కుమారుడు వెంకట్రామి రెడ్డికి, పిసిసి అధ్యక్షుడు మజ్జి తులసీదాస్, ద్రోణంరాజు సత్యనారాయణ, కిషోర్ చంద్రదేవ్‌లను రాజ్యసభ టిక్కెట్లు వరించాయి. త్వరలో రిటైర్ కాబోతున్న ద్రోణంరాజు సత్యనారాయణకు తిరిగి టిక్కెట్టు ఇప్పించటంలో ఎంపిలు డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి, కోణతాల రామకృష్ణ, విజయరామరాజు ప్రభృతులు కీలక పాత్ర వహించారు. ద్రోణంరాజుకు తిరిగి టిక్కెట్టు ఇవ్వాల్సిందిగా ఎంపిలు సామూహికంగా వెళ్లి ప్రధానిని కోరారట. ద్రోణంరాజుకు కూడా ప్రధాన మంత్రితో సత్సంబంధాలుండటంతో ఆయన కూడా సరేనన్నారు.

ముఖ్యమంత్రి తనకు అత్యంత సన్నిహితుడైన ఖురేషికి రాజ్యసభ సభ్యత్వం ఇప్పించాలని శతవిధాల పోరినప్పటికీ ఫలితం లేకుండా పోయింది. ముఖ్యమంత్రి సిఫార్సు

కొరవ 8 పేజీలో




# కాపుల కన్నెర్ర - పిసిసితో జోల!

అయిదు సీట్లలో కనీసం ఒక సీటు కాపుకులస్తులకు దక్కుతుందనుకున్న కాపులకు కాంగ్రెస్ టిక్కెట్ల పంపిణీ పూర్తి నిరాశకు గురి చేసింది. అసలే కాంగ్రెస్ పార్టీ కాపులను నిర్లక్ష్యం చేస్తోందన్న నేపథ్యంలో రాజ్యసభ టిక్కెట్ల పంపిణీ పుండుమీద కారంచల్లి నట్లయింది. కాగా తెలుగుదేశం పార్టీ రెండుసీట్లను కాపులకు కేటాయించి న్యాయంగా తెలివైన నిర్ణయం తీసుకుంది. ముఖ్యంగా కోస్తాలో బలమైన వర్గంగా వున్నకాపు కులస్తుల్ని ఆకట్టుకోవడానికి ఎర్రా నారాయణ స్వామికి టిక్కెట్టు ఇచ్చారు. అలాగే తెలంగాణాలో అత్యధికంగా వున్న మున్నూరు కాపుల్ని లాగడానికి డాక్టర్ అల్లాడి రాజకుమార్‌కు టిక్కెట్టు ఇచ్చారు. వీరిద్దరూ మొదటి నుంచి పార్టీకి విధేయులు కావటం గమనార్హం.

## కాపులకు పిసిసి పీఠం

కాంగ్రెస్ పార్టీపై కన్నెర్ర చేస్తోన్న కాపుకులస్తులను శాంతింపచేయటానికి పిసిసి అధ్యక్ష పదవిని ఆ కులస్తులకు కేటాయించాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. రాజ్యసభ టిక్కెట్ల కేటాయింపులో తన ప్రమేయం ఏదీ లేక పోయినప్పటికీ కనీసం చివరి సీటు విషయంలో అయినా పట్టుపట్టి కాపులకు కేటాయించి ఉండాల్సిందని కాపునాడు నాయకులు ఆగ్రహంగా వున్నారు. ఈ పరిస్థితుల్లో కాపుకులానికి

కొరవ 8 పేజీలో

తెలుగుదేశం తెలివిగా కాపులను జోకొట్టింది; కాంగ్రెస్ ఫిరాయింపు దార్లను పైకెత్తి కొరివితో తల గోక్కోబోతూంది!

# కాన్షీరాం అన్ని పార్టీల గుండెల్లో గుబులు పుట్టించాడు!

23 తేది ఆదివారం సాయంత్రం హైదరాబాదులో జరిగిన బహుజన సమాజ్ పార్టీ బహిరంగ సభ రాష్ట్ర రాజకీయాలలో తుఫాన్ రేపింది. అంత పెద్ద నిజాం కాలేజి గ్రౌండ్స్ జనంతో కిట కిట లాడి పోయింది. మధ్యాహ్నం సభ ప్రారంభమైతే సాయంత్రం వరకు జనం వస్తూనే వున్నారు. ఒక్క హరిజనులే కాదు - గిరిజనులు, కాపులు, ముస్లింలు, యాదవుల వంటి వెనుకబడిన, మైనారిటీ వర్గాల ప్రజలందరూ కాన్షీరాంలో ఒక కొత్త ఆశను సందర్శించినట్లు కన్పడింది ఆ జన సందోహన్ని చూస్తె! ఇటు కాంగ్రెస్ పై విరక్తితో, అటు తెలుగుదేశం పట్ల వ్యతిరేకతతో మూడవ ప్రత్యామ్నాయం కోసం ఆతృతగా ఎదురు చూస్తుండిన ప్రజానీకానికి కాన్షీరాం బహుజన్ సమాజ్ పార్టీ గమ్య స్థానంగా కన్పడిందా అన్పించింది ఆ సభ విజయవంతమైన తీరు చూస్తె!

సహజంగానే ఇది అన్ని రాజకీయ పార్టీల గుండెల్లో గుబులు పుట్టించింది. రాష్ట్రంలో ఈ రోజు ఏ పార్టీ కూడా రామన్న ఎన్నికల్లో గెలువ గలమని గుండెల మీద చేయి వేసుకొని చెప్పగల స్థితిలో లేదు. కాంగ్రెస్‌కు సంబంధించి ఎమ్మెల్యేలే తమకు ఐదేళ్ళ విరామం తప్పదని బహిరంగంగా వ్యాఖ్యలు చేస్తున్నారు. విజయ భాస్కర రెడ్డి ఎంత ప్రయత్నం చేసినా పార్టీకి జరిగిన డామేజి సరిదిద్దబడడం లేదు. ఆయనవి పాత కాలం రాజకీయాలు. ప్రజలతో సన్నిహిత సంబంధం పెంచుకొని, వారిని చైతన్య పరిచే స్ఫూర్తి ఆయనలో లేదు. వివిధ కారణాల వల్ల 1989 లో కాంగ్రెస్‌ను తమ భుజాల పై వేసుకొని మోసిన ముస్లింలు, కాపులు ఇతర వర్గాల ప్రజలు ఇప్పుడు అసంతృప్తితో వున్నారు. ఈ నాలుగేళ్ళ కాలంలో ప్రభుత్వాలకు తెలుగుదేశం చేసిన తప్పులు సరిదిద్దడానికి, సృష్టించిన వినాశనం సరిచేయడానికే సమయం సరిపోయింది. కొత్తగా ఏ కార్యక్రమంతోనూ ప్రజలను ఆకర్షించ లేక పోయింది. అందువల్లే ఎన్నికలంటే భయపడుతున్నారు.

ఒక్క దళితులే కాదు, బిసిలూ ఆయనలో ప్రత్యామ్నాయం చూస్తుండడం నాయకులను హడలెత్తిస్తూంది!

కొరవ 8 పేజీలో

# మహిళలతో కిసాన్ మేళ కళకళలాడింది!

ఐందుగలరందు లేరను సందేహము వలదనే పురాణ పద్యపు సారం విష్ణు భగవానుడికే కాదు వనితా మణులకూ వర్తించేట్లుంది. ఎక్కడ చూసినా వారే; అఖరుకు కిసాన్ మేళలో కూడా! గ్రామీణ జన జీవితంలో మహిళలది త్రోసి రాజనలేని స్థానమైనప్పటికీ రైతులుగా

వరి పరిశోధనా స్థానంలో వనితా రైతు సదస్సు జరిపించి కొత్త పద్ధతికి నాంది పల్కాడు రైస్ బ్రీడర్ రాఘవ రెడ్డి!

వారెప్పుడూ గుర్తింప బడరు. ఎంత మంది రైతు గృహిణులు పొలం పనులు స్వయంగా పర్యవేక్షిస్తుంటారు. వ్యవసాయ కార్యక్రమాలు గృహిణులు లేనిదే అంగుళం ముందుకు జరగవు. వ్యవసాయ కూలీలలో సగభాగం మహిళలే! కాని రైతులుగా రైతు సదస్సులు, రైతాంగ సభలు తదితరాలలో మహిళలకు ప్రాతినిధ్యం కల్పించాలనే ఆలోచన ఎవ్వరికీ రాదు. వారు ఎప్పుడూ ఉత్సాహమూ చూపలేదు.

నెల్లూరు వరి పరిశోధనా స్థానం అధిపతి డాక్టర్ పి. రాఘవ రెడ్డి ఈ లోపాన్ని సవరించడానికి, ఈ లోటును పూరించడానికి 22 తేది మహిళా కర్షక సదస్సు జరిపారు. మొదటి రోజు మగరైతుల సదస్సుకు 300 మందికి మించి హాజరు కాలేదు; అదే రెండవ రోజు మహిళా కర్షక సదస్సు అంటే 600 మందికి పైబడి వచ్చేశారు. అభ్యుదయ మార్గాలలో అభివృద్ధి కోసం ఆడవారు ఎంత తపన పడుతున్నారో, ఎంత ఆసక్తి చూపుతున్నారో ఈ మేళా వెల్లడించింది. వచ్చిన మహిళలందరూ ఎగ్జిబిషన్‌తో సరిపెట్టుకోకుండా, వరి పరిశోధనలు జరిగే పొలం గట్ల వెంబడి ఓపికగా తిరిగి, శాస్త్రవేత్తలను గుచ్చిగుచ్చి అడిగి వివరాలు తెలుసుకున్నారు.

మహిళా సదస్సుకు వ్యవసాయ విశ్వవిద్యాలయం హోం సైన్స్ డీన్ శ్రీమతి చిట్టెమ్మరావు సారథ్యం వహించారు. పొలం పనులు, వ్యవసాయ పోషాలతో పాటు మహిళా ఆదాయ వనరుల అభివృద్ధి, పొదుపు లక్ష్మి, పాడి పరిశ్రమ, పుట్టగొడుగుల పెంపకం, చేతి వృత్తి పరిశ్రమలు తదితర వాటిపై కూడా మహిళలకు వివరించి చెప్పారు.

తొలిరోజు మేళాను జగదేవిపేట అభ్యుదయరైతు శ్రీ జక్కా రంగారెడ్డి ప్రారంభించారు. వ్యవసాయ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ డాక్టర్ యువిరావు క్షేత్రదర్శన కార్యక్రమం ప్రారంభించారు. కర్షక సదస్సులో నెల్లూరు, కావలి, పొదలకూరు, వెంకటగిరి, తిరుపతి, గుంటూరు, గుంటూరులాం, కడప పరిశోధనా

కొరవ 8 పేజీలో




# సేడియం బోసిపోకుండా కుటుంబాలతో తరలి వచ్చారు!

ఈ ఏడాది రిపబ్లిక్ దినోత్సవం జరిగిపోయింది. క్యాలండర్‌లో జనవరి 25 తేదీ మారి 26 రావడం ఎంత గ్యారంటీయో, మన అధికారులు పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో ఆ ఉత్సవం జరపడమూ అంతే మామూలు. అదే స్థలం, అదే వేదిక, అదే పోలీసు విన్యాసం, వారే అధికారులు, వారుచెప్పే మాటలూ అవే, ప్రగతి వర్ణనలూ అవే- అంతా యాంత్రికత ; మొక్కుబడి. ఎన్నేళ్లు గడిచినా ఈ తంతులో మార్పేలేదు. ప్రజలు పెరేడ్‌కు రావడం మానివేయడం, షామియానాలు బోసి పోవడం ప్రతిసారీ చూసిన కలెక్టర్ గారు ప్రత్యేకంగా హుకుంజారీ చేసారేమో ఈ సారి ప్రతి అధికారి సకుటుంబ సపరివార సమేతంగా తరలి వచ్చారు. ఎమ్మెల్యే జె.కె. రెడ్డి, తన శ్రీమతితో పాటు సంవత్సరం కూడా నిండని మనమరాలినీ వెంట బెట్టు కొచ్చారు. పాత్రికేయులను ప్రతిసారి వెలివేసి దూరంగా కూర్చొబెట్టే వారు- ఈ సారి మాత్రం విఐపిల సరసన కూర్చొబెట్టారు. జిల్లా సాంస్కృతిక మండలి, దక్షిణ ప్రాంతీయ సాంస్కృతిక కేంద్రం తంజావూరు ఆధ్వర్యంలో ప్రత్యేకంగా వివిధ దళాలను పిలిపించినా పెరేడ్‌లో వారి అభినయ కౌశల్యాన్ని నిముషానికి మించి ప్రదర్శింప జేయక అధికారులు అడుగడునా అడ్డుపడి, తమదర్పం ప్రదర్శించారు. ఇంతకు ముందెన్నడో రాజస్థానీ కళాకారులు డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి గారి మనసును దోచారేమో, వాళ్లను ఎందుకు రప్పించ లేదని కలెక్టర్‌ను ఆయన వాకబు చేస్తుండినారు. పెరేడ్‌లో వ్యాఖ్యాతగా వ్యవహరించిన అధికారెవరో తెలియదు గాని ఆయన తడబాటు వల్ల ఎవరు సన్మాన పత్రాలు పుచ్చుకొంటున్నారో, ఏ రాష్ట్ర దళం ప్రదర్శన లిస్తుండిదో వినడం కనాకష్టమయ్యింది. జిల్లాలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలపై 6 పేజీల సమీక్షా పత్రం చదవను కలెక్టర్ ఎం. సాంబశివ రావు గారికి 16 నిమిషాలు పట్టింది. ఆ వుపన్యాసంలోని ముఖ్యాంశాలు కొన్నింటిని ఇస్తున్నాం.

బలహీన వర్గాల వారికి శాశ్వత గృహనిర్మాణ పథకం క్రింద నవంబరు మాసాంతరం వరకు జిల్లాలో 4251 గృహాల నిర్మాణం జరిగి రాష్ట్రంలో ప్రథమ స్థానం పొందింది. అసెంబ్లీ నియోజక వర్గ అభివృద్ధి పథకం క్రింద మంజూరైన 7326 గృహాలకు గాను 2091 గృహాలు పూర్తి అయ్యాయి. ఇవేగాక ఇందిరా ఆవాజ్ యోజన క్రింద 2053, బీడి కార్మికులకు 760, మత్స్య కారులకు 220, చేనేత కార్మికులకు 625 గృహాలు నిర్మిస్తున్నారని కలెక్టర్ వెల్లడించారు. ఏప్రెల్ 15 తేదీ నుండి

### రిపబ్లిక్‌డే మొక్కుబడి

జిల్లాలో సారా నిషేధాన్ని విధించి, దాని అమలుకు కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేయబడ్డాయి. త్రాగుడు వలన కలిగే అనర్థాలు ప్రజలకు తెలియజేసే ప్రచారం, సెమినార్‌లు, వర్క్‌షాపులు, సాంస్కృతిక కార్యక్రమాల వల్ల 95 శాతం పైగా సారానిషేధం జరిగిందన్నారాయన. బహుశా ఘనత వహించిన ఎక్సైజ్ అధికారులిచ్చిన భరోసాతో ఈ శాతం చెప్పి వుండవచ్చు. చెప్పేముందు ఒకసారి ఆలోచించి వుంటే బాగుండేది. జిల్లాలో లక్షా ముప్పైవేల మంది గ్రామీణ మహిళలతో నాలుగు వేల పొదుపు లక్ష్మి సంఘాలు ఏర్పడి కోటి రూపాయల మేర పొదుపు చేయబడింది. కుటుంబ నియంత్రణ ముమ్మరం చేసేందుకు కొన్ని ప్రోత్సాహకాలు కలెక్టర్ ప్రకటించారు. 75 శాతం పైగా ఆపరేషన్లు గ్రామ పంచాయతీ చేయించితే రెండు లక్షల రూపాయలు, 50 శాతానికి లక్షరూపాయలు అదే విధంగా మండలం మొత్తం మీద సాధిస్తే ఏడున్నర లక్షల రూపాయల గ్రాంటు అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టేందుకు మంజూరు చేయనున్నట్లు చెప్పారు. మేలైన వరి వుత్పత్తిలో విశిష్టతతో పాటు, పలురకాల వరి వంగడాలను నెల్లూరులోని వరి పరిశోధనా కేంద్రం రూపొందించి రైతాంగానికి సేవలందిస్తున్నట్లు; కోవూరు చక్కెర ఫ్యాక్టరీ వుత్పత్తిలో జాతీయ స్థాయిలో ద్వితీయ స్థానాన్ని పొందిన విషయాన్ని గుర్తు చేసారు.

వివిధ శాఖల్లో విశిష్ట సేవలు చేసి ప్రశంసా పత్రాలు పొందిన 41 మంది కలెక్టర్ చేతుల మీదుగా వాటిని అందుకున్నారు. వీరిలో ప్రతిభావంతంగా ఎంసెట్ పరీక్షా పత్రాల లీకేజ్, సొందాయమ్మ కేసులు

కొరవ 8 పేజీలో

## సంస్మరణ

పెరుమారెడ్డి సుబ్బరామిరెడ్డి గారు

స్వర్గీయ పెరుమారెడ్డి వెంకటసుబ్బమ్మ భర్త

మరణం : 1944 సం., జనవరి 14

మకర సంక్రాంతి - ఉత్తరాయణ పుణ్యకాలం

వారిని సంస్మరిస్తూ

పెరుమారెడ్డి వెంకట సుబ్బారెడ్డి - వజ్రావతమ్మ

పెరుమారెడ్డి శ్రీనివాసులు రెడ్డి - సుగుణమ్మ

పెరుమారెడ్డి జనార్దన రెడ్డి - బుజ్జమ్మ

పెరుమారెడ్డి జయరామిరెడ్డి - రమాదేవి

# అమెరికాను ఎదుర్కొందాం

ఇండియా వంటి బడుగు దేశం అత్యంత బలోపేతమైన అమెరికాను వ్యతిరేకించి నిలవగల్గడం అసాధ్యం కావచ్చు; అది, కొండను పొట్టేలు ఢీకొనడంగా కన్పించ వచ్చు. కాని ఆత్మాభిమానానికి అపద ఎదురైనప్పుడు, దేశ సమగ్రతకు ప్రమాదం వాటిల్లినప్పుడు గడ్డిపోచతోనైనా కొంత చిలువను కట్టిపడేయ చూడడం తప్పని సరి.

ఇటీవలి కాలంలో అమెరికన్ ప్రభుత్వము, దాని నేతలు భారతదేశం పట్ల ప్రదర్శిస్తున్న శత్రువైఖరి, గిల్లి కజ్జాలు పెట్టుకునే తుంటరి తనం మితిమీరి ప్రదర్శిస్తున్నారు. అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్ మొదటగా ఈ తప్పుడు తనానికి నాంది పల్కుతూ- ఐక్యరాజ్య సమితి వేదికపై నుంచి కాశ్మీర్‌ను కల్లోలిత ప్రాంతంగా అభివర్ణించారు. ఆ వెంటనే ఆయన గారి విదేశాంగ శాఖ ఉన్నతాధికారిణి రాబిన్‌రాఫెల్ ఇండియాలో కాశ్మీర్ విలీనం చెల్లదని ప్రకటించి తమ కుళ్ళుబుద్ధిని బయట పెట్టారు. ఆ వెంటనే బిల్‌క్లింటన్ కాశ్మీర్‌లో వేర్పాటు వాదం పేరిట అమాయక ప్రజలను పూచకోత కోస్తున్న ఒక తీవ్రవాద నాయకుడికి జాబు వ్రాస్తూ, మనిద్దరం కలిసి శాంతి నెలకొల్పుదాం అని ధర్మపన్నాలు పల్కాడు. ఇప్పుడు మళ్లీ పంజాబ్‌లో మానవ హక్కులు నాశనమై పోతున్నాయని, సిక్కులను రక్షించాలని పిలుపునిచ్చాడు.

వీటి తరువాతి పరిణామంగా పాకిస్తాన్ నాయకులు కాశ్మీర్ వేర్పాటు కోసం జిహాద్ (మతయుద్ధం) జరపాలని ప్రకటిం చారు. కాశ్మీర్‌లోని తీవ్రవాదులకు సహాయం అందించాలని వారి మాజీ ప్రధాని డిమాండ్ చేస్తున్నారు. ఆఖరుకు బెనజీర్‌భుట్టో కూడా యుద్ధం బెదిరింపులు చేస్తున్నది. ఇరాక్‌లో వలె ఇండియాపై ఆంక్షలు పెట్టాలంటున్నది.

తోడేలు, నక్క కూడ బలుక్కుని కుందేలు పిల్లలపై దాడికి సంకల్పించినట్లుందీ రెండు దేశాల వైఖరి. ఇతర దేశాల అంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకో కూడదన్న కనీసపాటి విజ్ఞత మర్చిపోయి, ప్రపంచ మంతటికీ తామే గూండాలమని, తమ కనుసన్నలలో అన్ని దేశాలూ నడవాలనే దురహంకార వైఖరితో వ్యవహరిస్తున్నారు అమెరికన్ నేతలు. రష్యా పతనమై పోవడంతో వారి దుందుడుకు తనానికి అడ్డు కట్టవేసే శక్తి ఎవరికీ లేకుండా పోయింది. అందుకే వారికా పొగరు.

అమెరికాలోని న్యూయార్క్, చికాగో నగరాల కంటే, మన పంజాబ్‌లో శాంతిభద్రతల పరిస్థితి ఎంతో మెరుగ్గా వున్నట్లు లెక్క. అమెరికాలో ప్రతి నిముషానికి వంద హత్యలు, యాత్రై అత్మహత్యలు జరుగుతుంటాయి. న్యూయార్క్ నగరంలోని కొన్ని ప్రదేశాలలో పట్ట పగలు వీధుల్లో తిరగడం కూడా ప్రమాదకరమని చెప్తుంటారు. ఇటలీ రాజధాని రోమ్ నగరం నేరస్తులకు నిలయం. బ్రిటన్‌లోనూ తీవ్రవాదం సమస్య అతి భయంకరంగా వుంది. ఇజ్రాయిల్‌లో ఎటువంటి భీకర యుద్ధాలు జరుగు తుండేది మనకు తెలుసు. ఇవన్నీ మర్చిపోయి ఒక్క ఇండియాలోనే పరిస్థితులు ప్రమాదకరంగా వున్నాయని బిల్ క్లింటన్ గారు కన్నీళ్లు కార్చడమేమిటి? కాశ్మీర్, పంజాబ్‌లలో భద్రతాదళాల పని తీరును విమర్శించిన ఆయన, ఆ రెండు రాష్ట్రాలలో తీవ్రవాద సంస్థలు సాగిస్తున్న నర మారణ కాండను తప్పు పట్టక పోవడంలో ఉద్దేశ్యమేమిటి? తీవ్రవాదులు అమాయక పౌరులను, పోలీసులను కసాయి తనంగా చంపితే అది మానవ హక్కుల భంగకరం క్రిందకు రాదా? ఈ హంతకులను అరెస్ట్ చేసి జైలులో పెడితే, లేదా ఆత్మరక్షణ కోసం ఎదురు కాల్పులలో వారిని చంపితేనే మానవత్వం హరించుకొని పోతుందా? ఏమిటీ కుత్సితత్వపు విమర్శ?

భారతదేశం ఆర్థికంగా ఎదగడం, ఆసియా [illegible]ంలో రాజకీయంగా [illegible]డం అమెరికాకు అసూయ కల్గిస్తున్నది. అణ్వా[illegible] వ్యాప్తి నిరోధక ఒప్పందంలో సంతకం [illegible] మనం నిరాకరిం[illegible] అహంకారాన్ని [illegible] భారతదేశం స్వతంత్రంగా [illegible] రిస్తూ ఆర్థికంగా నిలదొక్కుకుంటే, ఆసియా ఖండంలో తమ పెత్తనానికి భంగం కల్గుతుందన్న భయంతో. అణ్వస్త్ర తయారీ సామర్థ్యం, దూరశ్రేణి క్షిపణుల రూపకల్పన పరిజ్ఞానం కల్గిన భారతదేశాన్ని బెదరించి, మెడలు వంచి, అణు పరిశోధనలు, అంతరిక్ష పరిశోధనలు నిలిపి వేయించి అవి రెండూ తమ గుత్తసొత్తుగా అట్టిపెట్టుకొని ప్రపంచంపై కలకాలం పెత్తనం సాగించాలన్న కుళ్ళుబుద్ధితో అమెరికా నేతలు ఇట్లా రెచ్చగొట్టే వ్యాఖ్యలు చేస్తున్నారు. అవకాశం కోసం కాచుకొని వుండే గుంటనక్క వంటి పాకిస్తాన్‌ను దువ్వి, మన పై వుసి గొల్పుతున్నారు. అమెరికా అండ లేకుంటే బెనజీర్ భుట్టో, షరీఫ్ వంటి పిరికి పందలకు భారతదేశం పై కత్తులు నూరే ధైర్యం వస్తుందా?

జమీన్‌రైతు

ఈ ధోరణి గర్హనీయమైనది. ఈ అవమానం సహించరానిది. అమెరికాతో పోల్చితే మనకు ఆయుధాలు, ఆర్థిక బలం లేకపోవచ్చు.కాని వేలాది సంవత్సరాల సుదీర్ఘ చరిత్ర, అవధులెరుగని ఆత్మాభిమానం మనకు వున్నాయి. ఐఎంఎఫ్ విసిరే [illegible] మెతుకులకో, కోకోకోలా [illegible] కంపెనీలు పోసే గంజినీళ్ళకో మనం మన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, దేశ సార్వభౌమత్వాన్ని తాకట్టు పెట్ట వలసిన అగత్యం లేదు. ఎట్టి పరిస్థితులలోనూ మనం అమెరికా బెదిరింపులకు లొంగ వలసిన అక్కర లేదు. భారత ప్రభుత్వం అప్పటికే రాయబారి సిద్ధార్థ శంకర రే ద్వారా తన అసంతృప్తిని తెల్పింది. అయినా వారు తమ ధోరణి మార్చుకోవడం లేదు. ప్రధాని శ్రీ పివి త్వరలో జరుప నున్న అమెరికా పర్యటన రద్దు చేస్తామని ప్రకటించినా వారు చలించడం లేదు.

దౌత్యపరమైన మార్గాల ద్వారా భారత ప్రభుత్వం అమెరికాకు తీవ్రమైన ధోరణిలో తన వ్యతిరేకతను వెల్లడించ వలసి వుంది. అప్పటికీ వారు మాట వినకుంటే అన్ని ప్రపంచ వేదికల పై నుంచి ఈ దుర్మార్గాన్ని ఎలుగెత్తి చాటాలి. వర్థమాన దేశాల పై అగ్ర రాజ్యం దాడిగా అభివర్ణించి చిన్న దేశాలను ఏకం చేయాలి. దేశ గౌరవాన్ని, సార్వభౌమత్వాన్ని కాపాడుకోవడం కోసం భారతీయులంతా ముక్తకంఠంతో అమెరికా పొగరు బోతుతనాన్ని నిరసించాలి.

# మతోన్మాదులకు దళితులంటే చులకనా?

మరాట్వాడా విశ్వవిద్యాలయం పేరు 'డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్ మరాట్వాడా విశ్వవిద్యా లయంగా మార్చినందుకు శివసేన దుండగులు దహనకాండ చేస్తున్నారంటే వారి వున్మాదం ఎంత తీవ్రస్థాయిలో వుందో తేటతెల్ల మవుతుంది. బాబా సాహెబ్ అంబేద్కర్ విద్యార్థి దశలోనే అనేక ఆటుపోట్లు ఎదుర్కొన్నారు. సమాజం పట్ల ఆయనకున్న సృజనాత్మకతను పసిగట్టిన బరోడా మహారాజా వున్నత విద్యలకు విదేశాలకు పంపగా ఆ పోషకుని పేరు నిలబెట్టాడాయన. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పలు సంక్షోభాలలో కూరుకొని వున్న దేశానికి అవసరమైన రాజ్యాంగాన్ని రచించి, దేశం నేడు ఇంత అభివృద్ధి సాధించేందుకు కారణభూతుడయ్యాడు. బాబా సాహెబ్ అంబేద్కర్ అంటే అందరూ గౌరవిస్తారు; అపరిమిత మేధావి, సంఘ సంస్కర్తగా ఆయనవంటి గొప్పదేశ భక్తుని పేరు ఒక విశ్వవిద్యాలయానికి పెట్టడం మనదేశానికే గర్వకారణం. అసలీ పని ఎప్పుడో జరిగి వుండాలి. 15 సంవత్సరాల తర్వాత గవర్నర్ ఆర్డినెన్స్ ద్వార యూనివర్సిటీ పేరు మారిస్తే శివసేన వారికి [illegible] నష్టమొచ్చింది. రాష్ట్రంలో దహనకాండ జరపాల్సిన అగత్య మేమిటీ, దీనిని బట్టి చూస్తుంటే మతోన్మాదులకు దళిత జాతులంటే ఎంత కంట గింపో వెల్లడవుతుంది.

జనవాణి

కోపూరు -బి. వెంకట సుబ్బయ్య

### పోలీసులూ... ఆలోచించండి

ఒక పేదరాలికి జరిగిన అన్యాయాన్ని నిర్భయంగా ప్రజల దృష్టికి తీసుకొని రావడం ద్వారా 'జమీన్‌రైతు' తన కర్తవ్యాన్ని నిజాయితీగా నిర్వర్తించింది. ఇకనైన పౌరహక్కుల సంఘాలు, ప్రగతిశీల మహిళా సంఘాలు, దళిత సంఘాలు ముందుకొచ్చి ఆ కుటుంబానికి అండగా నిలవాలి. మేజిస్ట్రేటు గారు మరణవాఙ్మూలం నమోదు చేసి రెండు వారాలైన తరువాత కూడా ముద్దాయిలను పోలీసులు అరెస్ట్ చేయక పోవడం శోచనీయం. పోలీసులు తమ కర్తవ్య నిర్వహణలో నిత్యం వెనుకబడి పోతుంటే పేద ప్రజలకు, అనాథలకు రక్షణగా ఎవరు నిలబడతారు? ఈ సంఘటన పోలీసులకు కనువిప్పు వంటిది. ఖాకీ డ్రస్ వేసుకున్నందుకు చూపాల్సింది కసాయి తనం కాదు. కరుణ అది చూపించే వుంటే ఒక అమాయక ప్రాణం బుగ్గిపాలయ్యేది కాదు. ఇకనైనా

కొరవ 8 పేజీలో

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

28.1.1944
పేజీలు 6, వెల 0-1-6

### గ్రామసీమలు

#### పొట్లపూడి

23రాత్రి సుజన రంజనీ సమాజసభ్యులు సమావేశమై పుస్తక భాండాగార భవన నిర్మాణ ప్రయత్నం చేయవలసినట్లు, అంత వరకు మరొక యిల్లు తీసుకొని అచ్చట పఠన మందిరం, పుస్తక భాండాగారం స్థాపించవలసినట్లు తీర్మానించారు. గ్రామ పెద్దలు చేయూతనిస్తామన్నారు. తిరుగా 30 రాత్రి సమావేశం.

- సెక్రటరీ.

#### కావలి

శ్రీ చంద్రమతి [illegible] మోసం జేసి వివాహం చెసుకున్నాడు అని పాచ్చా సాహెబ్ మీద పెట్టి[illegible] కేసు ట్రాన్సుఫరుకు [illegible] 17[illegible]

జమీన్‌రైతు

వాయిదా. ముద్దాయి పక్షాన ఒంగోలు వకీలు యల్లంరాజు సుందర్రావుగారు వాదిస్తున్నారు.

-ఒ.వి.

#### అల్లూరు

పోలీసు స్టేషన్ తగులబెట్టిన కేసులో ముద్దాయిలకు హైకోర్టులో [illegible] విడుదలకు ఉత్తర్వు [illegible].

-ఒ.వి.

#### అర్బన్ బ్యాంకు

[illegible] 6వ తేదీ ముగ్గురు డైరెక్టర్ల ఎన్నిక జరుగుతుంది. అంటే [illegible] నరసింహారావు,వు. వేగురు వెంకటప్పయ్య, చింతా సత్యనారాయణ గార్ల స్థానముల [illegible] మాట-

[illegible]గారు 15 సం.గా డైరెక్టరుగాను, 12సం.గా సెక్రటరీగాను ఉండి రు.3600లు జీతంగాని భత్యం తీసుకుని ఉన్నారు. వీరు హైస్కూలు హెడమాస్టరుగా యీ మధ్య నియమింపబడ్డారు. ఆ పనే బోలెడు వుంది. పిల్లకాయల చదువు ఆలోచిస్తే వీరికి యితర పని లేకుండా చేయడం అవసరం. ఆయనగా మానుకోలేదు. సభ్యులైనా యీమాటు వీర్ని ఎన్నుకోకుంటే హైస్కూలుకు లాభం జేసినట్లు-

వేగూరు వెంకటప్పయ్యగారు 8 సం.గా సభ్యులు, 2 సం.గా కార్యదర్శి. వీరు గూడా హైస్కూలు ఉపాధ్యాయులు. ఇలాంటి వారికి యితర వ్యాసంగం లేకుంటే మంచిది. ఇతర వ్యాసంగం కల్పించడమంటే హైస్కూల్లో చదివే పిల్లల నోట మట్టి గొట్టటమన్నమాట;

చింతా సత్యనారాయణగారు. వీరుగూడా 10 సం.గా డైరెక్టరుగా వుంటున్నారు. వీరికి గూడా యితర వ్యాప్తి ఎక్కువ.

సరిగాక ఒక్కొక్కరే ఇన్నేసి యేళ్ళు పీఠాసనాలు వేసుకుని కూర్చుంటే తక్కినవాళ్లు నేర్చుకొనేదెట్లా? పై పెద్ద దినాలు జరిగే కొర్ధి మొగమాటాలు, లాలూచీలు, బినామీలు యెక్కువై బ్యాంకు జీవితానికే వంద.

కొరవ 10 పేజీలో

## మునిసిపాలిటీకి ఇప్పటికైనా బుద్ధి వస్తుందా?

# వేదాయపాళెంలో చందాలతో రోడ్డు!

ఇల్లు కట్టు కొనే ముందే బిల్డింగ్ ట్యాక్స్, ఇతర టాక్సులు కట్టించుకొన్న మునిసిపాలిటీని కనీస సౌకర్యాలు కల్పించమని ఏళ్ల తరబడి సంవత్సరం టాక్సులు కట్టించుకోవడమే గాని రోడ్డు, డ్రైనేజీ వీధి దీపాలను కూడా మునిసిపాలిటీ ఏర్పాటు చేయలేక పోయింది. సైకిల్ పోను కూడా సరియైన సౌకర్యం లేదిక్కడ; డ్రైనేజీలు లేకపోవడం వల్ల దోమలు స్వైర విహారం చేస్తుంటే; వీధి దీపాలు లేక పోవడం వల్ల చీకటి పడితే దొంగ తనాలు ఎక్కువయ్యాయి. మునిసిపల్ అధికారులకు అర్జీలు, స్వయంగా వెళ్లి కలవడాలు ఎన్నోసార్లు చేసిన ఈ ప్రాంతీయులు విసిగి పోయారు. మునిసిపాలిటి ఏదో చేస్తుందన్న భ్రమలు తొలగించుకొన్నారు. ఆజాగా ఇంటికి కొంతగా తాహతును బట్టి వసూలు చేసి రోడ్డు గుంటలు పూడ్చుకొన్నారు. రోడ్డు అంచున మురికి నీరు పారుదల ఏర్పాట్లు చేసుకొన్నారు. వీధి దీపాలను ఏర్పాటు చేయడంలో మునిసిపాలిటి విఫలమయ్యే పక్షంలో పన్నుల నిరాకరణకు నడుం బిగిస్తారట. అయ్యా కమీషనర్ గారూ ఒకసారి ఆ ప్రాంతానికి వెళ్లి పరిశీలించి కొన్ని లైట్లు వేసి సమస్యను పరిష్కరించ కూడదా!

> లైట్లువేయకుంటే పన్నులు కట్టమని హెచ్చరిస్తున్నారు- కమీషనర్ గారూ ఖబడ్దార్!

అడిగి, అడిగి విసుగు చెందిన ప్రజలు తామే శ్రమదానంతో స్వంత ఖర్చులతో రోడ్డు పనికి ఉపక్రమించారు. ఇందుకుగాను వేదాయపాళెం బస్టాపుకు పడమర, పొగాకు గోడౌన్సుకు తూర్పు, ఉత్తరం, పొదలకూరు రోడ్డుకు తూర్పున మ్యామిలిటరీ కాలనీకి దక్షిణ ప్రాంతాలలో వున్న వారంతా ఒక సంఘంగా ఏర్పడ్డారు. ప్రతి

## ప్రభుత్వ డ్రైవర్ల సంఘ సహాయం

వింజమూరు పి.డబ్ల్యుడి శాఖలో డ్రైవరుగా పనిచేస్తూ గుండెపోటుతో మరణించిన తమ సంఘ సభ్యుడు ఎ. మస్తానయ్యకు జిల్లా ప్రభుత్వ డ్రైవర్ల సంఘం మూడు వేల రూపాయల ఆర్థిక సహాయం చేసింది. ఈ మొత్తాన్ని సంఘం అధ్యక్షుడు ఎ. అంకేశ్వర రావు సంఘ సభ్యులతో కలిసి స్వయంగా అందజేశారు.

20వ తేదీ అనం వెంకన్న నగరకు విచ్చేసిన జైన మత గురువు విజయారాజేంద్ర సురీశ్వర్ మహారాజ్, ఆయన శిష్య గణాన్ని స్వాగతిస్తున్న అనం వివేకానంద రెడ్డి

## దర్గామిట్ట పోస్టల్ రిక్రియేషన్ క్లబ్

దర్గామిట్ట పోస్టల్ రిక్రియేషన్ ఎన్నికలు ఇటీవల జరిగాయి. అధ్యక్షునిగా డి. వెంకయ్య, కార్యదర్శిగా డి. పెంచలయ్య, సహకార్యదర్శిగా ఎ. వెంకటస్వామి, కోశాధికారిగా ఎన్. సత్యనారాయణ ఎన్నికయ్యారు. వీరితో పాటు హరిరావు, ఈశ్వరయ్య, చంద్రశేఖర్, శ్రీనివాసులు, వసుంధర కార్యవర్గ సభ్యులయ్యారు.

# సద్భావనారైలు వచ్చి పోయింది!

> నెల్లూరు సంగతులు

భారతజాతి సమైక్యత, సామరస్యాలకు, శాంతికి, పురోగతికి ప్రజలను కార్యోన్ముఖులను చేసేందుకు బయలుదేరిన సద్భావనా రైలు 23 తేదీ నెల్లూరు చేరుకొంది. గాంధీ జయంతి రోజున ఢిల్లీ నుండి బయలు దేరిన ఈ రైలులో వివిధ రాష్ట్రాలకు చెందిన 220 మంది యువతీ యువకులున్నారు. దేశవ్యాప్తంగా ఇప్పటి వరకు 51 కేంద్రాలు పర్యటించిన ఈ బృందం 52వ మజిలీగా నెల్లూరు చేరినట్లు డైరక్టర్ డాక్టర్ ఎస్.ఎస్. సుబ్బారావు చెప్పారు. తొలుత నేతాజీ సుభాస్ చంద్రబోస్ విగ్రహానికి పూలమాలలు వేసిన బృందం టౌన్‌లోని బ్రహ్మానందపురం, ప్రగతి నగర్, నీలగిరి సంఘం, అరుంధతీయ బట్వాడి పాళెం మురికి వాడలలో జాతీయ సమైక్యతా నినాదాలిస్తూ పర్యటించారు. రంగనాయకుల స్వామి దేవాలయం, బారాషహీద్ దర్గా, ఆర్.సి.యం. చర్చి కూడా సందర్శించారు. అనంతరం సాయంత్రం కస్తూరిబా కళాక్షేత్రంలో జాతీయ సమైక్యత సమగ్రతలు చాటి చెబుతూ ఇచ్చిన సాంస్కృతిక

కొరవ 11 పేజీలో

# దొరలకు వడ్డీలిచ్చిన నెల్లూరు వ్యాపారి!

> చెన్నపురిలో నెల్లూరీయుత
>
> ప్రొఫెసర్ అచ్చిరెడ్డి, ఎం.ఎ.పి.హెచ్.డి.

గత సంచిక తరువాయి

| వర్తకుని పేరు | గోదాముల సంఖ్య | నెలకు బాడుగ (వరహాలలో) |
|---|---|---|
| కాశీ కామయ్య | 10 | 26 |
| పల్లెపాల భగవానులు | 8 | 33 |
| ఊటగిరి రమణయ్య | 10 | 19 |
| మాచ కృష్ణయ్య | 10 | 20 |
| అయినాల విట్టన్న | 15 | 30 |
| అయినాల విస్సన్న | 7 | 14 |
| పెదమార్ల జగన్నాయకులు | 7 | 14 |

తమ గోదాములను అప్పులలోకి కట్టి పూర్తిగా పోగొట్టు కొన్న వారిలో నీలున్నము కాశీ రాములు, మునుసూరి ముసలయ్య, తోటపల్లి తొంబయ్య, తోటపల్లి అర్మగం ముఖ్యులు. వీరందరూ నెల్లూరు వర్తకులను నిల్వచేసే వర్తకులై నప్పటికీ వీరిలో ఎంత మంది నెల్లూరు సీమ వారో తెలియదు.

చెన్నపురికి ధాన్యాన్ని సరఫరా చేసిన వారిలో చాలా మంది రెడ్లు వుండడం విశేషం. దాసురెడ్డి అనే పేరు పొందిన వ్యవసాయ వర్తక వ్యాపారి క్రీ.శ. 1760 - 1780 సం. ల మధ్య కాలంలో నెల్లూరు, ఉత్తర ఆర్కాటు, చెంగల్పట్టు, దక్షిణ ఆర్కాటు జిల్లాల నుండి చెన్నపురికి ధాన్యాన్ని, బట్టలను విరివిగా సరఫరా చేస్తుండేవాడు. ఇతనికి నెల్లూరు సీమతో నెల్లూరీయులైన చెన్నపురి వర్తకులతో సన్నిహిత సంబంధాలుండేవి. స్వల్ప కాలంలోనే అపరిమిత ధనం ఆర్జించిన దాసురెడ్డి చాలా మంది చెన్నపురి వ్యాపారులకు, ఆంగ్లేయ వర్తకులకు కూడా అప్పులు ఇస్తుండేవాడు. ఇతని వ్యాపార సంస్థలో చాలామంది భాగస్వాములు, సిబ్బంది వున్నట్లు తెలుస్తుంది. ముండ్ల వంకల సోమయాజులు అనే బ్రాహ్మణ శ్రేష్టుడు, ఎర్రుమల్లి పేరరాజు అనే క్షత్రియ సాహసి కూడా దాసురెడ్డి వ్యాపార జాబితాలో వుండేవారు. ఎవరెవరు, ఏయే గ్రామాలలో ఏయే ధాన్యాలను, ఎంత మేరకు, ఏయే ధరలకు కొనేవారు, ఏవి వాహనాలలో ఎంత ఖర్చుల తోటి వీటిని చెన్నపురికి చేర్చేవారు, ఎంత లాభాలను ఆర్జించేవారు వంటి పరిశోధనా వివరాలు మనకు లభించడం లేదు.

ఆ తర్వాత కాలంలో అంటె దాదాపు 1810 వ సం. వరకు చెన్నపురికి గుడ్డలు, ధాన్యం సరఫరా చేస్తుండిన వారి పట్టికలలో నెల్లూరీయులు చాలా మంది వున్నారు. వీరిలో కొందరికి చెంగల్పట్టు, దక్షిణార్కాట్టు ప్రాంతాలతో కూడా వ్యాపార సంబంధాలున్నట్లు తెలుస్తుంది. అవధానం పాపయ్యకు సహచరులుగా వుండిన రాయారెడ్డి, రెడ్డి రావు అనే ధాన్యపు వర్తకులు వీరిలో ముఖ్యులు. వీరి క్రింద సహాయకులు, సేవకులు చాలా మంది చెన్న నగరంలో వుండినట్లు తెలుస్తున్నప్పటికీ, వారి ప్రాంతీయులో ఖచ్చితంగా తెలియడం లేదు. కాని వీరిలో చాలా మందికి నెల్లూరు సీమ తోటి సంబంధ బాంధవ్యాలుండేవి.

> బ్రిటీషు ప్రభుత్వం నుంచి కుచ్చుల గొడుగు పట్టించుకొనే హోదా పొందిన నెల్లూరు మేధావి; మరొక నెల్లూరు బ్రాహ్మణుడు నవాబు పరిపాలన అధ్వాన్నమని ధైర్యంగా కంపెనీకి రిపోర్టు ఇచ్చాడు!

17, 18 మరియు 19 వ శతాబ్దాల నాటి చెన్నపురిలో మన దేశీయులైన (Natives) ప్రభుత్వోద్యోగులలో పేరెన్నిక గన్న ఏక వర్గీయులు దుభాషీలు. వీరిలో అవధానం పాపయ్య (నెల్లూరు పాపయ్య), వెన్నెలకంటి సుబ్బారావు, కావలి వెంకట బొర్రయ్య తదితర నెల్లూరీయులు ప్రసిద్ధులు. కావలి వెంకట బొర్రయ్య క్రీ.శ. 1796 సం. నుంచి మెకంజీ దొర గార్కి ముఖ్య సహాయకుడిగా, మున్షీగా, మరియు దుభాషీగా పనిచేశాడు. క్రీ.శ. 1800 సం.కి పూర్వమే వెంకట బొర్రయ్య తెలుగులో కొన్ని గ్రంథాలను వ్రాసినట్లు, 1803 వ సం.లో ఈయన జైనులను గూర్చి ఆంగ్లభాషలో Asiatic Research (London) లో ప్రకటించిన వ్యాసాలను బట్టి తెలుస్తుంది. కాని ఈయన పూర్వీకులు నెల్లూరుకు చెందిన వారని చెప్పేందుకు ప్రత్యక్ష సాక్ష్యాధారాలు కొంచెమే. వెంకట బొర్రయ్య పాండిత్యాన్ని కంపెనీ వారు పలు విధాలుగా వుపయోగించు కున్నారు. బొర్రయ్య దక్షిణ భారతదేశంలో గొప్ప జిజ్ఞాసువులు, పండితులునైన బ్రాహ్మణ వంశీయులని తాళపత్ర గ్రంథాలను అన్వేషించి,

> నెల్లూరు ధనికులొకరు రెండు వందలేళ్లనాడే మద్రాసులో బ్యాంకు స్థాపించాడు; ఆర్కాటు నవాబుకు పెద్ద మొత్తాలలో తన స్వంత ధనం అప్పుగా ఇచ్చాడు!

కొరవ 10 పేజీలో

# అల్లూరు కాలేజి అధికారం కోసం కీచులాటలు !

గత కొన్ని రోజులుగా అల్లూరులో ఉత్కంఠత రేపుతుండిన అల్లూరు రామకృష్ణా జూనియర్ కళాశాల కరస్పాండెంట్ ఎన్నిక 20 తేది పంతాలు, పట్టింపుల మధ్య ఉద్రిక్త వాతావరణంలో జరిగిపోయింది. నూతన కరస్పాండెంట్‌గా అల్లూరు మాజీ సర్పంచ్ అల్లంపాటి సీతారామిరెడ్డి దివంగత గోపాల్ రెడ్డి స్థానే పదవీ బాధ్యతలు స్వీకరించారు. గత పదేళ్ల నుండి చదువు, సంధ్యలు తెల్లారి నట్లున్న ఈ కాలేజి అభివృద్ధికి ఏ ఒక్క నాయకుడూ చొరవ తీసుకోక పోయినా, వర్గ రాజకీయాల మూలంగా పదవుల పిచ్చి ముదిరి పెత్తనం కోసం మాత్రం ఎంతో కష్టపడ్డారు, పాపం?తమ కుటుంబ వారసత్వాన్ని వదులుకోకూడదన్న పంతంతో అల్లంపాటి సీతారామి రెడ్డి గట్టిగా పట్టుబడితే మారిన రాజకీయ చదరంగంలో ఆయన మేనల్లుడు ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి దాన్ని బ్రద్దలు చేయాలన్న కృత నిశ్చయంతో మరింత పంతం పట్టాడు. కళాశాలలో నిధుల దుర్వినియోగంతో పాటు బోగస్ సంతకాలు, సిబ్బంది ఇష్టారాజ్యం వంటి విషయాల్ని ఎమ్మెల్యే వర్గీయులు ముఖ్యమంత్రి వరకు తీసుకొని వెళ్లడం, ఆయన ఆదేశం మేరకు గుంటూరు నుండి రీజినల్ జాయింట్ డైరెక్టర్ విచారణ జరిపి వెళ్లడం జరిగింది. ఇంతకు మునుపు కరస్పాండెంట్ అల్లంపాటి గోపాల్ రెడ్డి అనారోగ్యం వల్ల తన పదవీ బాధ్యతలన్నీ సీతారామ రెడ్డికి ఇవ్వడం నచ్చని కొంత మంది పాలక వర్గ సభ్యులు జిల్లా విద్యాధికారి గారికి ఫిర్యాదులు చేసినమీదట ఉపాధ్యాయులకు జీతాల చెల్లింపులో ప్రతిష్టంభన ఏర్పడు తుందన్న అనుమానంతో డిసెంబర్ జనవరి 20 తేదిన కొత్త కరస్పాండెంట్ ఎన్నిక జరపాలని నిశ్చయించు కొన్నారట. ఎన్నికల నోటిఫికేషన్ విడుదలకు ముందే వారసత్వపు కోటాలో అల్లంపాటి విజయవర్ధన్ రెడ్డి, రామకృష్ణా రెడ్డిలకు సభ్యత్వ మిచ్చారట. తన తండ్రి వారసత్వ సభ్యత్వం తనకు, వదాన్యులు కీర్తిశేషులు అల్లంపాటి రమణారెడ్డి సభ్యత్వం తన అమ్మమ్మ కృష్ణవేణమ్మ కివ్వమని, అందుకు డిపాజిట్‌గా చెల్లించవలసిన పదిసి వేల రూపాయల డి.డి లను ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి ఒక సం ॑ వ్యక్తి ద్వారా సీతారామ రెడ్డి వద్దకు పంపగా ఆయన వాటిని తీసుకోను తిరస్కరించారట. 20 తేది కాలేజి ఆవరణలో జరుగుతుండిన పాలక వర్గ సమావేశానికి ఎమ్మెల్యేనే స్వయంగా తరలివచ్చి తన సభ్యత్వ విషయం అడిగారట. 91 సంవత్సరం మార్చి 23 తేది నూకల పాటి వెంకారెడ్డి ద్వారా ప్రతి పాదింప బడిన వారసుల జాబితాలో విష్ణువర్ధన్ రెడ్డి

కొరవ 7 పేజీలో

> పదవుల పేరుతో పంతాలేనా, చదువుల గతి పట్టించుకునే దేదైనా వుందా?

# రాపూరులో అన్నీ వెట్ డేలే!

కంచే చేను మేసిన చందాన ఎక్సైజ్ శాఖ కాపలాతోడై దినమైన మంగళవారం కూడా రాపూరులో బ్రాందీ షాపులు తెరచి వుంచి మందు బాబులకు ఖుషీని పంచుతున్నారు. వుద్యోగులకు జీతాలిచ్చే నెల మొదటి రోజున షాపులు మూయించి వుంచాలన్న నిబంధననూ తుంగలోకి తొక్కేశారు. జిల్లా అధికార్లు మాత్రం బ్రాందీ అమ్మకాల పై పలు కట్టుదులు విధించామని జిల్లా కేంద్రంలో కూర్చుని కట్టు కథలు చెబుతున్నా రాపూరులో అవన్నీ వట్టి మాటలే! అక్కడ అన్ని రోజులూ వెట్‌గానే వుంటున్నాయి.

## సర్వారాయ పాళెంలో మాతంగి నృత్యం!

అధికారులు చట్టాలు చేస్తూనే వుంటారు. వాటి ఆచరణ అమలు ప్రజలు చేతుల్లోనే వుంది. ఇటీవల జిల్లాలో మాతంగి దురాచారం లేకుండా చేయాలని, ఈ వృత్తిలో స్థిరపడ్డ మహిళ లందరినీ సమీకరించి, సదస్సు నిర్వహించి, వృత్తి విద్యలలో శిక్షణ ఇచ్చి అర్థిక సహాయం అందించేందుకు పథకాలు కూడా చేసి కష్టపడుతూనే వున్నారు. మరో పక్క సంక్రాంతి రోజున కావలికి సమీపంలో

> జిల్లా వార్తలు

సర్వాయ పాళెం గ్రామంలో తిరుపతి, బాపట్ల నుండి తీసుకొచ్చిన మాతంగులను పోటా పోటీగా గ్రామస్థులు ఆడించారట. అధికారు లెవరూ ఈ దురాచార పునరుద్ధరణకు బాధ్యులైన వారెవరిపై ఎటువంటి చర్యా తీసుకోలేదట.

## స్పందన లేని పోలీసు

రెండు నెలల క్రితం తన ఇంటి ఆవరణలో నిలిపి వుండిన ట్రాక్టర్ ను తీసుక వెళ్లిన విషయమై పోలీసులు ఎటువంటి చర్య తీసుకోక పోగా ఫిర్యాదు కూడా నమోదు చేయలేదని ఆవేదన చెందుతున్నాడు వింజమూరు మండలం చాకలి కొండ గ్రామ రైతు సత్తా పుల్లయ్య. డిసెంబర్ 4 తేది వర్షం కురుస్తుండిన సమయంలో గుర్తు తెలియని వ్యక్తులు ఇంటి ఆవరణలో వుండిన అతని ట్రాక్టరు తోలుకుని వెళ్ళి పోయారట. ప్రక్కరోజు ఫిర్యాదు చేసినా ఇంత వరకు పోలీసులు వులుకు పలుకు లేరట. ఎస్పీగారు విషయం పరిశీలించి తగు ఆదేశాలిస్తే ఆ మధ్యతరగతి రైతును ఆదుకొన్న వారౌతారు.

కొరవ 7 పేజీలో

## [illegible]
## [illegible]

### 3 లక్షల ఎకరాలకు రెండవ పంటకు నీరు

పెన్నార్ డెల్టా క్రింద నెల్లూరు, కోవూరు తాలూకాలలోని అన్ని గ్రామాలకు మార్చి 1 నుంచి జూన్ 30 తేది వరకు 3 లక్షల ఎకరాలకు పై బడి (లక్షా 30 వేల హెక్టార్లు) రెండవ పంటకు నీరు ఇస్తున్నట్లు కలెక్టర్ శ్రీ సాంబశివ రావు ప్రకటించారు. ఈ ఏడాది వానలు బాగా కురిసి, సోమశిలలో పుష్కలంగా నీరు వుండడంతో మొత్తం ఆయకట్టు రెండవ పంటకు నీరు ఇచ్చే సదుపాయం కల్గింది. రైతులు నీటిని పొదుపుగా వాడుకొంటే, పంట పూర్తి కాలం ఎవరికీ ఇబ్బంది వుండదని, నీటి పారుదల అధికారులతో సహకరించాలని కలెక్టర్ గారు విజ్ఞప్తి చేస్తున్నారు.

సోమశిల ప్రయోజనం ఇన్నేళ్లకు నెల్లూరు రైతాంగానికి చేతికి అందుతున్నదన్న మాట. ప్రభుత్వం కరుణించి ప్రాజెక్టు ముంపు భూములకు నష్టపరిహారం త్వరితంగా విడుదల చేస్తే నెల్లూరు, కోవూరు డెల్టాలే కాదు - కావలి కాలువ, కనుపూరు కాలువ రైతులు, ఆత్మకూరు ప్రాంతీయులు శాశ్వతంగా నీటి సమస్య నుంచి విముక్తులౌతారు. ఆత్మకూరు, వింజమూరు, రాపూరు, ఉదయగిరి ప్రాంతాలలో భూగర్భ జల మట్టం పెరిగి మెట్ట సేద్యానికి ఫిల్టర్ పాయింట్ల సౌలభ్యం కల్గుతుంది. వాన చినుకు కోసం నింగికేసి నిక్కి చూడాల్సిన దుర్గతి తప్పుతుంది.

ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి ఆ మధ్య ముఖ్యమంత్రిని కలిసి ఈ విషయమై విన్నవించారు. ఇతర ఎమ్మెల్యేలూ వినతి పత్రాలిచ్చారు. ముఖ్యమంత్రి మార్చిలోగా మొత్తం పరిహారం చెల్లింపు పూర్తి చేస్తామని, మొదటి విడతగా 10 కోట్లు ఇచ్చేస్తామని జెకెకి చెప్పారట. అదింకా నెల్లూరు వరకు చేరినట్లు లేదు. 30 కోట్లు ఇవ్వగల్గితే కడప జిల్లాలో వచ్చే సోమశిల రిజర్వాయర్ వెనుక తట్టు పొలాలలో నీరు నిల్వచేసేవీలు కల్గుతుంది. ప్రాజెక్టులో 75 టిఎంసిల వరకు నీరు నిల్వ చేయవచ్చు. సోమశిలలో ప్రస్తుత నీటి పరిమాణం 35 టిఎంసిలు; ఆ నిల్వతోనే 3 లక్షల ఎకరాలకు నీరివ్వడం అందిస్తు గల్గుతున్నారంటే - 75 టిఎంసిల నీరు నిల్వచేస్తున్నప్పుడు జిల్లాలో మాగాణి సేద్యం ఎంత కళకళ లాడుతుందో అర్థం చేసుకోవచ్చు. జిల్లా ఎమ్మెల్యేలు సమిష్టిగా కృషి చేసి జిల్లా రైతాంగానికి ఈ ఉపకారం చేసి పెట్టగల్గితే వారి పదవులు సార్థక మౌతాయి.








### యానాది రెడ్డి గారి శివ దీక్షలు

అయ్యప్ప మోజులో ఆంధ్రభక్తులందరూ కేరళ రాష్ట్రానికి పరుగులు తీయడం దేవుళ్ల మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి గారికి కష్టం కల్గించినట్లుంది. ఈ వేలంవెర్రికి విరుగుడుగా ఆయన శివదీక్షలు జరిపిస్తున్నట్లు ప్రకటించారు.

40 రోజుల దీక్ష ఇది. శ్రీశైలం, శ్రీకాళహస్తి దేవాలయాలలో దీన్ని ప్రారంభిస్తున్నారు. భక్తులు ఈ నలభై రోజులూ చందనపు రంగు గుడ్డలు ధరించాలి; చెప్పులు వేసుకో కూడదు; నుదుట విభూతి రాసుకోవాలి; రుద్రాక్షమాల మెడలో వుండాలి; రోజుకు ఆరు సార్లు శివ పూజ చేయాలి; రోజుకు ఒక పూటె భోజనం; వినోదం, శృంగారం, మద్యపానం వుండకూడదు. నేల పై నిద్రపోవాలి. దీక్షలో వున్న వారు ఒకరినొకరిని ఓం నమశివాయ అని పలకరించు కోవాలి. 40 రోజుల తర్వాత మహాశివరాత్రి రోజు శివాలయంలోని చెట్టు క్రింద దీక్ష విరమించాలి. ఓపిక లేని వారి కోసం దీక్ష కాలంలో రిబేటు వుంటుందట. వారు 5, 11, 21 రోజుల షార్ట్ టర్మ్ స్వీకరించ వచ్చు. ఈ దీక్ష పట్టిన వారికి శ్రీశైలం, శ్రీకాళహస్తి దేవాలయాలలో "పాగ దర్శనం" ఇప్పిస్తారు.

ఇదీ మంత్రి గారి దీక్షా పథకం. అయ్యప్పస్వామికి తెలిస్తే పేటెంట్ హక్కుల చట్టం క్రింద డంకెల్ కోర్టుకు ఈడుస్తాడేమోనండీ యానాది రెడ్డి గారు!

### యానాది రెడ్డి

దేవుళ్ల మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి 26 తేది ఉదయం కావలికి వచ్చారు. ఆ రోజు మధ్యాహ్నం నెల్లూరు సందర్శించారు. 27 తేది కావలిలో గడిపి రాత్రికి తిరుగు రైలెక్కారు.

### రొయ్యల సభ

నెల్లూరు జిల్లా రొయ్యల పెంపకం దారుల సభ 30 తేది ఉదయం నుంచి సాయంత్రం వరకు కస్తూరిదేవి విద్యాలయంలో జరుగుతుంది. ఎం.పి.ఇ.డి.ఎ. డైరక్టర్ డాక్టర్ ఎం. శక్తివేలు, ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి, కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు తదితరులు పాల్గొంటారు. జిల్లాలో రొయ్యల పెంపకం రైతులు ప్రస్తుతం ఎదుర్కొంటున్న అమ్మకం పన్ను, వ్యవసాయేతర భూమి శిస్తు, మత్స్యకారుల ఆందోళన తదితరాల పై చర్చ జరుగుతుంది. థాయిల్యాండ్‌కు చెందిన సిపి గ్రూపు తమ మేత నాణ్యత పైన, ఆధునిక రొయ్యల పెంపకం పరిజ్ఞానం పైన శాస్త్రవేత్తల చేత సలహా లిప్పిస్తుంది.

రొయ్యల పెంపకం రైతులు విరివిగా సమావేశంలో పాల్గొనాలని ఆహ్వానిస్తున్నది - నెల్లూరు జిల్లా సంఘం.

### పంచాయితీ సలహాలు

రాష్ట్రంలో పంచాయితీ రాజ్ చట్టంలో మార్పు చేర్పుల పై అధ్యయనం జరుపుతున్న శాసన సభ సెలెక్ట్ కమిటీ సమావేశం ఫిబ్రవరి 1, 2 తేదులలో తిరుపతి యూనివర్సిటీ సెనేట్ హాల్‌లో జరుగుతుంది. సలహాలు ఇవ్వాలను కున్నవారు, సమస్యలు చెప్పదల్చుకున్న వారు ఆ రోజు వినతి పత్రాలు సమర్పించవచ్చు.

### నెల్లూరు రిపబ్లిక్ డే టివిలో రిలే

నెల్లూరు పోలీసు పెరేడ్ గ్రౌండ్స్‌లో జరిగిన రిపబ్లిక్ డే ఉత్సవాన్ని భారత్ వీడియోస్ కేబుల్ టి.వి. నెట్ వర్క్ అనే సంస్థ అదే రోజు కేబుల్ టివిల ద్వారా రిలే చేసింది. మొత్తం కార్యక్రమాన్ని టౌన్‌లోని ఏడెనిమిది వేల టివిల్లో పౌరులు సందర్శించారు.

స్థానిక కార్యక్రమాలకు ఇటువంటి ప్రసారాలు ఏర్పాటు చేయడం అభినందనీయం.

### శేషమ్మ కేసు

వెంకటేశ్వరపురం సమీపంలోని పాల డైరీ వద్ద నివసించే గృహిణి శ్రీమతి అబ్బిశెట్టి శేషమ్మ ఆత్మహత్య కేసు పరిశోధన ముందుకు జరగడం లేదు. నిందితులైన ముంతాజ్, నాజూసలు ఇంకా పరారీలోనే వున్నారు. వారు హైదరాబాదులో తమ బంధువుల ఇంట తలదాచు కుంటున్నట్లు సమాచారం అందడంతో నెల్లూరు నుంచి ఒక ప్రత్యేక బృందం రాజధానికి బయల్దేరి వెళ్ళింది.

### జర్నలిస్టుల ఎన్నికలు

నెల్లూరు జిల్లా జర్నలిస్టుల యూనియన్ ఎన్నికలు మినీ అసెంబ్లీ ఎన్నికలంత ఆగంతో 30 తేది జనవరిలో జరుగనున్నాయి. విజయులు, వీర స్వర్గారోహకులు, క్షతగాత్రుల ముచ్చట్లు పై వారం!

### పొట్టేళ్ల పథకం- లక్షల లాభానికి లక్!

సినీ నటుడు శ్రీ గుమ్మడి వెంకటేశ్వర రావు అధ్వర్యంలో కమర్షియల్ అగ్రో ప్రొడక్ట్స్ ప్రైవేటు లిమిటెడ్ అనే సంస్థ నెల్లూరులో ఒక పెద్ద పొట్టేళ్ల ప్రాజెక్ట్ నెలకొల్పు తున్నది. ఇక్కడ వాతావరణానికి అనువుగా జాతిపి జాతి గొర్రెలు, పొట్టేళ్లు పెంచుతారట. ఈ జీవాల తోళ్లు, మాంసం, కొమ్ములు తదితరాలతో పాటు, వాటి మెదడు, లివర్, పాంక్రియాస్, ఊపిరితిత్తుల నుండి పలు రకాల ఔషధాలు తయారు చేయవచ్చునట. వీటన్నింటినీ అమెరికా, యూరప్ వంటి దేశాలకు ఎగుమతి చేసే ఉద్దేశ్యంతో ఆధునిక కర్మాగారాలలు నెలకొల్పుతున్నారు.

పొట్టేళ్ల పెంపకంలో లక్షల లాభాలున్నాయని, ఇందుకోసం ఒక పథకం రూపొందించామని, అందులో చేరి లాభపడమని కోరుతున్నది సంస్థ. వివరాలు కంపెనీ ఆఫీసులో విచారించుకోండి!

### రాధామాధవ కావ్య పఠనం

శ్రీ టి. వేదాంతాచారి వ్రాసిన రాధామాధవ రస తాండవం

కొరవ 7 పేజీలో

## సణుగుడు

(12 పేజీ కొరవ)

అది అరుస గొప్పతనమౌతుంది. అయితే దేశంలో దళితులకు కాన్షీరామ్ నాయకుడు, తనొక్కడే పార్టీ అనే భ్రమలో వున్నట్లున్నారాయన. స్వతంత్రం అనేమాట పుట్టక ముందు నుంచే కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీలు దళితుల సేవకు ఎంతో కృషి చేశాయి. ఈరోజు గ్రామస్థాయి నుంచి కేంద్ర మంత్రిత్వాల వరకు హరిజన, గిరిజనాది వర్గాల వారు పదవులలో వుంటూ గల్గుతున్నారంటే అందుకు కాంగ్రెస్ పార్టీయే కారణం. తాలూకాఫీసు గుమస్తా నుంచి కేంద్ర క్యాబినెట్ సెక్రెటరీ వరకు ఆ వర్గాల వారు ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తిస్తున్నారంటే అందుకు కాంగ్రెస్ నాయకులు కల్పించిన పరిస్థితులే కారణం. అస్పృశ్యత అనేదాన్ని పారద్రోలి పల్లెల్లో, పట్టణాలలో అన్ని తరగతుల ప్రజలూ ఒకే వర్గంగా సహజీవనం చేస్తున్నారంటే అందుకు కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీలు సుదీర్ఘ కాలం నల్పిన సాంఘిక ఉద్యమాలే కారణం. చదువుల్లో, ఉద్యోగాల్లో, రాజకీయాలలో, సంఘ జీవనంలో దళితులకు న్యాయం చేకూర్చడానికి ఎన్ని వందల చట్టాలు తయారై వున్నాయో, ఎన్ని వేల కోట్ల నిధులు ఖర్చవుతున్నాయో లెక్కలేదు.

ఈ వాస్తవాలన్నిట్నీ విస్మరించి, అగ్రవర్ణాల పట్ల దళితులలో విద్వేషం పెంచి తద్వారా అధికారంలోకి రావాలను కోవడం ప్రమాదకరం. ఒక వర్గం తన శక్తి తాను తెలుసుకొని అధికారంలోకి రావడానికి, ఇంకొక వర్గాన్ని శత్రువుగా భావించ వలసిన అవసరం వుందా? బలాధిక్యం నిరూపించు కోవడానికి తమలో ఐక్యత రావాలే తప్ప, తమలో చైతన్యం రావాలే తప్ప ఇతరుల పైకి తమ వారిని ఉసి కొల్పవలసిన అవసర వుందా? బహుజనులకు రాజ్యాధికారం అంటే, ఇతర జనులకు రాజ్యంలో అధికారంలో వుండదనే భీతి కల్గించడం అవసరమా?

కాన్షీరాం పార్టీ ఎన్నికల్లో గెల్చే అవకాశముంది కాబట్టి, అందరి కంటె ముందుగా అక్కడ చేరి పోదాం అనే ఆత్రుతతో పరుగులు పెడుతున్నవారు ఒక్క నిముషం ఆగి ఆలోచించి, ముందుకు అడుగు వేయడం అవసరం.



### నెల్లూరు ముచ్చట్లు

([illegible] పేజీ కొరవ)

గ్రావ్యపఠనం 2 తేది సాయంత్రం 6.30 గంటలకు టౌన్‌హాల్ రీడింగ్ రూంలో జరుగుతుంది. రసికులందరినీ రమ్మంటున్నారు - వర్తమాన సమాజం కార్యదర్శి శ్రీ బి.వి. నరసింహం.

### లయన్స్ క్లబ్ నేత్ర శిబిరాలు

నెల్లూరు లయన్స్ క్లబ్ ఫిబ్రవరి మొదటి వారంలో ఒకేసారి రెండు చోట్ల రెండు ఉచిత నేత్ర చికిత్సా శిబిరాలు నిర్వహించ బోతున్నది. 1 నుంచి 6 తేది వరకు నెల్లూరు కోటమిట్టలోని షాది మంజిల్‌లో; 2 నుండి 7 తేది వరకు పాటూరు గ్రామంలో ఈ శిబిరాలు జరుగుతాయి. నెల్లూరు శిబిరాన్ని ఎమ్మెల్యే శ్రీ జె.కె.రెడ్డి; పాటూరు శిబిరాన్ని ఎమ్మెల్యే శ్రీ సివి శేషారెడ్డి ప్రారంభిస్తారు. కళ్లజోళ్లు, భోజనం తదితరాలన్నీ ఉచితమే!

నెల్లూరు ఐఎంఎ సిటిజన్స్ క్లబ్, హిమ్మత్ ... అగ్రోమెరైన్ లిమిటెడ్ సంస్థలు శిబిరాలకు సహాయ పడుతున్నాయి. పేద రోగులు ఈ అవకాశాన్ని వినియోగించు కోవాలని క్లబ్ క్యాంప్ ఛైర్మన్, స్టీరియో సౌండ్స్ ఆంజనేయులు కోరుతున్నారు.

### భార్య శీలం పై శంకతో హత్య చేసిన భర్త

వెంకటగిరి రైల్వే స్టేషన్ వద్ద కాపురం వుంటున్న నెల్లూరు ప్రభాకర్ అనే టెలిఫోన్ ఉద్యోగి, 23 తేది రాత్రి తన భార్య పద్మ (30) ను కిరాతకంగా పొడిచి చంపేశాడు. ప్రభాకర్ గూడూరు టెలిఫోన్ ఎక్స్ఛేంజిలో పనిచేస్తున్నాడు. రోజూ వెంకటగిరి నుంచి వెళ్లి వస్తుంటాడట. భార్య శీలం పై శంక కల్గింది. 23 పరపురుషుడితో కలిసి వున్నప్పుడు పట్టుకొని, నిలదీసి, ఆవేశం ఆపుకోలేక కత్తితో పొడిచి చంపేశాడట. తర్వాత పోలీసులకు లొంగి పోయాడు.

### కొమ్మల పూడిహత్య కేసు త్రోసివేశారు

మనుబోలు మండలం కొమ్మలపూడి గ్రామంలో 1988 నవంబర్ 14 తేది రాత్రి జరిగిన మస్తానయ్య హత్య కేసు, సాక్ష్యాధారాలు లేనందువల్ల త్రోసివేస్తూ నెల్లూరు జిల్లా అదనపు జడ్జి తీర్పు చెప్పారు.

మస్తానయ్య భార్య బుజ్జమ్మకు, చేవూరి హరి అనే రైల్వే గ్యాంగ్ కూలీకి అక్రమ సంబంధం వుండేదట. అది తెలిసి మస్తానయ్య అభ్యంతరం చెప్పి మందలించాడు. హరిని ఇంటికి రానివ్వడం లేదట. ఆ కోపంతో హరి, తన మిత్రుడు తోట రామారావుతో కలిసి 13 తేది రాత్రి మస్తానయ్య ఇంటికి పెరటిదారిలో వచ్చారని, అరికిడికి నిద్రలేచిన బుజ్జమ్మను బెదరించి, మస్తానయ్య గొంతు నులిమి చంపి, శవాన్ని బావిలో పారేశారని; బుజ్జమ్మ మొదట తన భర్త కన్పించడం లేదని గ్రామంలో అమాయకత్వం నటించినా, ఆ తర్వాత పోలీసు విచారణలో తన భర్తను తన కళ్ల ఎదుటే హరి, అతడి మిత్రుడు కలిసి చంపి బావిలో పారేశారని వెల్లడించిందని ప్రాసిక్యూషన్ వాదం. అయితే కోర్టు విచారణ సమయంలో ఆమె ఈ హత్య వివరమే తనకు తెలియదని చెప్పడంతో, వేరే సాక్ష్యం ఏదీ లేక న్యాయమూర్తి కేసు త్రోసి వేశారు.

ఈ కేసులో ప్రాసిక్యూషన్ తరపున అడిషనల్ పిపి శ్రీ ఎస్.ఎం. సైదా; డిఫెన్స్ తరపున న్యాయవాది శ్రీ పి. కోటయ్య వాదించారు.

### వి.ఆర్ కాలేజిలో రిపబ్లిక్ డే!

వి.ఆర్ కాలేజిలో జనవరి 26 పండుగ సంబరంగా జరిగింది. కమిటీ అధ్యక్షుడు శ్రీ తూపిలి సుందర రామ రెడ్డి జెండా ఎగుర వేశారు. న్యాయవాది శ్రీ నాగారెడ్డి శ్రీనివాసులు రెడ్డి, ప్రిన్సిపల్ డాక్టర్ గోపాల కృష్ణమూర్తి తదితరులు మాట్లాడారు. విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొన్నారు.

### నెల్లూరు బజారు

మొలగొలుకులు

9672 (పాతవి) 3,500/-
9672 (కొత్తవి) 3,000/-
9674 (పాతవి) 3,700/-
సన్నాలు 3,000/-

### అల్లూరు కాలేజి

(5 పేజీ కొరవ)

పేరుండడాన్ని, తరువాత సభ్యత్వం పునరుద్ధరించుకోక పోవడాన్ని, నోటిఫికేషన్ వెలువడ్డాక కొత్త సభ్యులను చేర్చుకోరన్న విషయాన్ని సీతారామిరెడ్డి ఖరాఖండిగా చెప్పేసరికి ఎమ్మెల్యే వెనుతిరిగి వెళ్లిపోయాడు. తరువాత మెజార్టీ సభ్యులు బలపరచడంతో సీతారామి రెడ్డి తంతున్ని పూర్తయ్యింది. హైకోర్టు ద్వారా ఏదో ఒకటి చేయాలన్న ఒక వర్గం ఎత్తును దెబ్బతీసేందుకు మరో వర్గం కూడా హైదరాబాదుకు మకాం మార్చి వుంది.

### జిల్లా వార్తలు

(5 పేజీ కొరవ)

### అల్లూరు వినియోగదారుల సంఘ సమావేశం

చెప్పుకో తగ్గ సమస్యలు చేపట్టి పోరాడినట్లుగాని, అసలు సంఘ వునికే వున్నట్లు గాని తెలియని అల్లూరు గ్రామ వినియోగ దారుల సంక్షేమ సంఘ ప్రథమ వార్షికోత్సవం ఆదివారం జరిగింది. జిల్లా అధికారులంతా తరలి వస్తారని నిర్వాహకులు పెద్ద ఎత్తున ప్రచారం చేసినా ఎవరూ రాలేదు. అల్లూరీయుడు నెల్లూరు బార్ అసోసియేషన్ అధ్యక్షులు మాతభూషి సుందరాచారి వినియోగ దార్ల చట్టం హక్కుల గూర్చి క్లుప్తంగా చెప్పారు. ఇటీవల 4 నెలలు న్యాయవాదులు కోర్టులు బహిష్కరించడం బాగోలేదని, ఏప్రెల్ 30 తర్వాత తాను ప్రాక్టీస్ చేయనని ఖరాఖండిగా చెప్పేశారు. డి.ఎస్.ఓ. భరత్ రెడ్డి జిల్లాలో నిత్యావసర సరుకుల పథకానికి ప్రతి సంవత్సరం 25 కోట్లు వెచ్చిస్తున్నామన్నారు. రేషన్ సక్రమంగా అందడం లేదని గ్రామాల నుండి ఫిర్యాదులు రావడం లేదన్నారు. ఫిర్యాదులు పంపిన వారిపై ఎటువంటి చర్యలు తీసుకొన్నారో చెప్పలేదాయన. స్వర్గీయ రాజీవ్ గాంధీ హయాంలో భారత దేశంలో వినియోగ దార్ల వుద్యమం మొదలైనట్లు వివరించారు. విద్యుత్ శాఖ ఎస్.ఇ. రామలింగారెడ్డి మాట్లాడుతూ అన్నిరకాల వస్తువులకు ముందు డబ్బు చెల్లిస్తే తరువాత అవి ఇస్తారని; కాని విద్యుత్‌ను ముందు ఇచ్చి తరువాత డబ్బులు వసూలు చేస్తున్న విషయం ప్రజలు గమనించాలన్నారు. ఆ శాఖ డి.ఇ. గోపాల్ రెడ్డి కూడా మాట్లాడారు. వేదికపై సంఘానికి చెందిన యేటూరు వెంకటరమణారెడ్డి, నూకల పాటి సుందర రామిరెడ్డి ఆశీనులయ్యారు. సభారంభానికి ముందు చిన్నారులు వరలక్ష్మి, శాంతి, జీవన పాడిన ప్రార్థనా గీతం విన సొంపుగా వుండింది.

### నాయుడుపేట బ్యాంకుకు కొత్త హంగులు

నాయుడుపేట, ప్రజల సౌకర్యార్థం కో ఆపరేటివ్ బ్యాంక్ శాఖను పట్టణ నడి బొడ్డున అన్నిబ్యాంకింగ్ సదుపాయాలతో కూడిన కొత్త భవనంలోకి మార్చారు. 2 తేది జిల్లా కో ఆపరేటివ్ బ్యాంక్ అధ్యక్షులు శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి చేతులమీదుగా దీన్ని ప్రారంభించారు. స్ట్రాంగ్ రూంకు జిల్లా సహకార శాఖాధికారి ఎం. జయరామరాజు, బంగారు ఆభరణాలపై అప్పుల కౌంటరుకు బ్యాంకు భవన స్వంత దారులు ... జయప్రకాష్ రిబ్బన్ కట్ చేశారు. జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు టి. వేణుగోపాల్ రెడ్డి, బ్యాంకు జనరల్ మేనేజర్ కె. నాగేశ్వరరావు, ఆర్.టి.ఎ మెంబరు పి.సి ఆర్ గోపాల్ రెడ్డి కార్యక్రమంలో పాల్గొన్నారు.

### రమ్యగీతిక ఆవిష్కరణ

గూడూరు మున్సిఫ్ కోర్టులో అమీనాగా పని చేస్తున్న జి. వెంకయ్య వ్రాసిన వివిధ గేయాల సంపుటి రమ్యగీతిక ను పారిశ్రామిక వేత్త కె. ధనుంజయరెడ్డి ఆవిష్కరించారు. 19 తేదీ తమ సొంత సంస్థానంలో వెంకటగిరి రాజ వంశీయుడు వి. సాయి కృష్ణ యాచేంద్ర గేయధార ప్రక్రియ అనంతరం పుస్తక ఆవిష్కరణ జరిగింది. గేయ ధారకుడ్ని రమ్యగీతికకుడ్ని లైన్స్ క్లబ్ వారు తగిన రీతిలో సత్కరించారు. ఈ కార్యక్రమంలో లయన్ డాక్టర్ వై.కె. ప్రభాకర్ రెడ్డి, అడ్వకేట్ వై. చలపతి రావు పాల్గొన్నారు.



### ప్రకటన

నెల్లూరు సబ్ రిజిష్ట్రేషన్‌లో చేరిన గుండ్లపాళెం గ్రామంలోని కోరు మాగాణి పాత పట్టా నెం. 88 రు. పాత సర్వే నెం. 217 రు; కొత్త పట్టా నెం. 74 రు. కొత్త సర్వే నెం. 12/2 రు లో య 1.89 ట్లు భూమి మా పిత్రార్జితమై వుండి నేను నా ముగ్గురు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు వెరశి మేము ఏడుమంది జాయింటుగా అనుభవించు చున్న భూమిని మేము విక్రయించు చున్నాము. యీ ఆస్తి మీద పరాధీనములు ఏమీ లేవని, మేము తప్ప యీ ఆస్తికి హక్కుదారులు ఎవరూ లేరని యిందు వెంట ప్రకటించు చున్నాను.

**దామవరపు రాగమ్మ**
W/o. Late అబ్రహాం గారు
కపాడిపాళెం, నెల్లూరు

### ప్రకటన

నా క్లయింట్ కె. గోవింద రావు, 15/503, R.R. Street, నెల్లూరు. ఈ క్రింది షెడ్యూలు స్థిరాస్థిని నెల్లూరు సంతపేట వాస్తవ్యులు లేట్ గార్లపాటి రామయ్య గారి కుమారుడు గార్లపాటి కోదండ రామయ్య గారి వద్ద నుండి కొనదలచినారు. కానీ సదరు కోదండ రామయ్య ఒరిజనల్ సేల్‌డీడ్ పోయినది అని తెలిపి నందున క్రింది షెడ్యూలు స్థిరాస్థి తాలూకు ఒరిజినల్ విక్రయ పత్రం ఎవరి వద్దనైనా వున్న యెడల వెంటనే నాకు చేర్పవలసినది. 15 రోజుల లోపల ఎవరి వద్ద నుంచి గాని ఎటువంటి జవాబు లేనిచో తరువాత మేము గాని, సదరు ఆస్తి గాని జవాబు దారీ కాము.

#### షెడ్యూలు

స.రి.డి. నెల్లూరు, టౌన్, రంగనాయకుల పేట ఆనకట్ట రోడ్డు వార్డు నం. 8, డోర్ నం. 77 గల మిద్దె ఇల్లు, పెంకుటింటికి హద్దులు. తూ: రోడ్డు, ద: మాదాల బాలతిమ్మయ్య కళ్యాణ మండపం, ప: ఏటిపొర్లు కట్ట, ఉ: ఇప్తి వల్లాయమ్మ ఇంటికి ఈ ఇంటికి మధ్య జాయింట్ వరసందు. ఈ హద్దులోని మూమారు 40 అం. ఖాళీ స్థలములో అందులోని మిద్దె ఇల్లు, పెంకుటిల్లు.

**పైడా యశ్వంత్‌నాథ్**
వకీలు, సంతపేట, నెల్లూరు

# శివారెడ్డి పద్యాలు

### జి. ప్రసాద్

కాలివాటి కొంగుబంగారివి
పేదసాదల పాలి పెన్నిధివి
నీదు నీతి, విద్య నీ నేర్పు నీ కూర్పు
అగణితమ్ము జి. ప్రసాద్ రెడ్డి!

వరుసుగోల వేద శాస్త్రాలు వల్లించ
నాటుపురము శుద్ధమోటుగాళ్లె
నిన్నుబట్టుకొల్చి వెలుగులోని విలవితిత
నాగరికులు సభలో నవ్వుతారు!

పదులు నూర్లు వేలు పద్యాలు వ్రాయమ్ము
తిప్పబోయ్యవద్దు తీసుకొచ్చి
ఎక్కువైతె వేదు ఏదైన, ఏదైన
మళ్లీ కలుసుకుంటా వెళ్ళి వస్తా!

### దువ్వూరు సుబ్రామయ్య

కవితలంటె పాలు కళ్ళద్దుకుంటారు
వాసికొర్కినావు వైద్యమునకు
మంచితనము, మట్టు మర్యాద నీ సొత్తు
సుబ్రామా! వేదమూర్తి కవిరి

### కన్నతల్లి దండ్రి

కన్నతల్లిదండ్రి కాలప్రవాహంలో
కలసిపొయ్యి ఎంతో కాలమైంది
యిక్కడుంది నేను యేముంది చేసేది
తిండి ఖర్చు, ప్రతిది దండగింక!

పైకి పొయ్యి నేను ప్రతిరిజాసేసివస్తా
మంచి చెడ్డ మీకు మనవిజేస్తా
మాపొరిపొ వచ్చి, మీకు మాకుతిరారో
అత్రనిస్తా ప్లైయినో అందజెయ్యి!

## జనవాణి

(3 పేజీ కొరవ)

పోలీసు మిత్రులు ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని పేదప్రజలపై ఆదరణ, అనురాగం చూపాలని మనవి.

కావలి -పి. సుధాకర రెడ్డి

శబరిమలైలో

### భక్తుల పాట్లు!

ఏటేటా అయ్యప్ప భక్తుల సంఖ్య పెరిగిపోతుంటే శబరిమలైలో ప్రాథమిక సౌకర్యాలు తరిగిపోతున్నాయి. ఈ సంవత్సరం జ్యోతి దర్శనానికి పోయిన భక్తులు పడిన పాట్లు వర్ణనాతీతం. పంబానది నుండి సన్నిధానం వరకు కాలినడకన సాగే మార్గం ఇప్పటికి ఏమాత్రం అభివృద్ధి చేయక పోవడం వల్ల భక్తులు పలు సమస్యల పాలవ్వాల్సి వచ్చింది. ఇరుకు మార్గంలో ముందుకు సాగలేక ఎంతో మంది ప్రాణాలు కోల్పోయారు. కొంత మంది గాయపడ్డారు. మరి కొంత మంది దొంగ స్వాముల బారిన పడి వేలాది రూపాయలు పోగొట్టు కున్నారు. చిన్న పిల్లలను తీసుకు వెళ్లిన వారి కష్టాలకు కొలమానమే లేదు. గ్లాసు నీరు రూపాయికి అమ్మారు. సన్నిధానం సమీపంలో తినేందుకు ఏమి దొరకక భక్తులు ఆకలితో అలమటించారు. జట్లు, జట్లుగా వచ్చిన వారు విడి పోయారు. స్వాముల రద్దీని క్రమబద్ధం చేయను పోలీసులు తమ లాఠీలను వీపుల పై నృత్యం చేయించారు. దిన దిన ప్రవర్ధమాన మవుతున్న పుణ్యక్షేత్రంలో ప్రాథమిక సౌకర్యాలు కల్పించాలన్న జ్ఞానం అక్కడి రాష్ట్ర ప్రభుత్వానికి వుండాలి. లక్షలాది రూపాయలు లాభాలు గడిస్తున్న దేవస్థానం బోర్డ్ అందులో ఏ కొద్ది ఖర్చు పెట్టి వుండినా భక్తులు ఇన్ని దురవస్థలు పడి వుండరు.

నెల్లూరు -బాధిత భక్తుడు

### మంత్రిగారు వీటి సంగతి చూడండి

జిల్లాలో అష్టబంధి నిత్య ధూప, దీప నైవేద్యాలకు నోచని దేముళ్ళు ఎంతో మంది వున్నారు. చారిత్రకంగా ప్రసిద్ధి గాంచిన పలు దేవాలయాలు దుస్థితిలో వున్నాయి. ముఖ్యంగా దేవాదాయ మంత్రి గారు ప్రాతినిధ్యం వహిస్తున్న కావలి నియోజక వర్గంలోని జువ్వలదిన్నె గ్రామంలో ఎన్నో ఏళ్ల క్రిందటి రామాలయం రూపు రేఖలు మారిపోయి వుంది. కొండ బిట్రగుంటలోని వెంకటేశ్వరుని తేరు రథం ఆధారం విరిగి పోయి చాలా రోజులయ్యింది. కొత్తగా కావలిలో నిర్మిస్తున్న అయ్యప్ప దేవాలయంతో పాటు నెల్లూరు నవాబుపేట ఆలయం పై కూడా మంత్రి గారు కరుణ చూపాలి.

- కె. సుజాత నాగరాజా రావు

కావలి

### సర్వేపల్లిలో సి.వి. సేవలు

సర్వేపల్లి నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్న సి.వి. శేషారెడ్డి ప్రజలకు ఎంతగానో అందుబాటులో వుంటున్నారు. నియోజక వర్గంలో సమస్యలు తెలుసుకొనేందుకు గాను ఆయన ఎక్కని గడపంటూ లేదు. ప్రతి చిన్న సమస్యను కూడా అధికారుల దృష్టికి తీసుకు వెళ్లి వెంటనే పరిష్కార మార్గాలు చూపే సివి, ఇటు వంటి ధోరణిలోనే కొనసాగాలని ఆకాంక్ష.

కోడూరు -వి. మాధవరావు

### పాత జ్ఞాపకాలు పంచింది

జనవరి 21 వ తేది సంచికలో 50 ఏళ్ల క్రితం ఈ వారం శీర్షికలో రాసిన రమణాశ్రమంలో రమణ మహర్షి జయంతి వార్త పాత జ్ఞాపకాలను మళ్లీ నెమరు వేసుకొనే లా చేసింది. ఆ రోజుల్లో రమణాశ్రమాన్ని కీర్తిశేషులు నెల్లూరు వెంకట్రామ నాయుడు గారు, ప్రొఫెసర్ రామచంద్ర కౌండిన్య జిల్లా నుండి తొలిసారిగా సందర్శించి అక్కడి విశేషాలను పరిశీలించారు. ఇప్పటికి ప్రతి సంవత్సరం జయంతి వుత్సవాలు ఘనంగా ఆశ్రమంలో జరుగుతూనే వున్నాయి. ధ్యానానికి అపరిమిత స్థానమిచ్చే ఈ ఆశ్రమ సందర్శనలో చెప్పలేనంత మానసిక ప్రశాంతత లభిస్తుంది.

గూడూరు -ఒక పాఠకుడు

### దుస్థితిలో తుఫాను షెల్టర్లు

ప్రకృతి వైపరీత్యాల నుండి సముద్ర తీరప్రాంత ప్రజల ప్రాణాలు కాపాడేందుకు తుఫాను షెల్టర్లను ప్రభుత్వం నిర్మిస్తున్నది. వాటిని కట్టడం పూర్తి చేసిన రెండవ నెలలోనే అవి రక్షణ లేక అనాథలుగా మారిపోతున్నాయి. తీరప్రాంత ప్రజలే వాటి ద్వారబంధాల తలుపులను, కిటికీరెక్కలను పూడబెరుక్కొని పోతున్నారు. కొన్ని గ్రామాల్లో పశువులు, మేకలు, గొర్రెలను కట్టేస్తుంటే మరికొన్ని చోట్ల క్లబ్బులుగా వుపయోగించుకొంటున్నారు. షెల్టర్లు వారి సౌకర్యార్థమే నిర్మించినవన్న విషయాన్ని ఆయా ప్రాంతీయులు ఎందుకు మరచిపోతున్నారో అర్థం కావడం లేదు. ఇప్పటి వరకు జరిగిందేదో జరిగిపోయింది. ఇకనైనా ప్రభుత్వం తగిన శ్రద్ధ వహించి ప్రతిగ్రామంలోని వున్న గ్రామ పరిపాలనాధికారులకు వీటి పోషణ బాధ్యత అప్పగించాలి. తీరప్రాంత గ్రామంలో ప్రజలలో కొంత మందిని కమిటీగా చేర్చి షెల్టర్ల దుస్థితి మార్చడంలో కలెక్టర్ శ్రద్ధ వహించాలి.

కావలి -బి. కొండయ్య

## కిసాన్‌మేళా

(2 పేజీ కొరవ)

స్థానాల నుంచి వచ్చిన శాస్త్రవేత్తలు రైతుల ప్రశ్నలకు సమాధానాలు చెప్పారు. మత్స్యకళాశాల ప్రిన్సిపల్ డాక్టర్ పి. బాబూరావు చేపల పెంపకంపై సలహా లిచ్చారు. సదస్సును తిరుపతి రీజినల్ జాయింట్ డైరక్టర్ డాక్టర్ జెవిరెడ్డి అధ్యక్షించారు. సాయంత్రం సభ- కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివరావు, ఎమ్మెల్యే శ్రీ సివి శేషారెడ్డి, ఎమ్పీ, కుమారి కె. పద్మశ్రీ, వ్యవసాయ శాఖ డైరెక్టర్ శ్రీ జన్నత్‌హుసేన్ తదితరులు మాట్లాడారు. రెండు రోజుల సభలకూ అసిస్టెంట్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్ శ్రీ పెంచల రెడ్డి వందనాలు చెల్లించారు.

## రిపబ్లిక్ డే

(2 పేజీ కొరవ)

దర్యాప్తు చేసిన సి.బి.సి.ఐ.డి. ఇన్స్‌పెక్టర్ వి. మధుసూధన రావు, వరి పరిశోధనా స్థానంలో సరికొత్త వరి వంగడాల అన్వేషణలో నిరంతరం మునిగి వుండే డాక్టర్ పి. రాఘవ రెడ్డి, కలెక్టరేట్‌లో ఆరుగంటల తరువాత కూడా కనపడే సూపర్నెంట్ ఎ. శ్రీనివాసరావు, పొదుపు లక్ష్మి వుద్యమానికి ప్రాణం పోసిన లేగుంటపాడు కమ్యూనిస్ట్ యువకుడు గునుపాటి ప్రసాద్ రెడ్డి వున్నారు. సాంస్కృతిక కార్యక్రమాల్లో సిక్కిం వారు ప్రదర్శించిన యాక్‌డాన్స్, తమిళనాడు బృందాల కరంగ కావాడి, మెమ్మినృత్యం, ఉత్తర ప్రదేశ్ జాగర్, కర్నాటక దారి డొల్లు కుక్షిత, ఖమ్మం వాళ్ళు ప్రదర్శించిన డప్పుడాన్స్ నెల్లూరు వారికి కొత్త కావడంతో ఆసక్తిగా చూసారు.

## కాన్షీరాం

( మొదటి పేజీ కొరవ)

తెలుగుదేశం పరిస్థితి సంతోషంగా లేదు. సదస్సులు విజయవంతమౌతున్న ప్పటికీ, ఈ జనాన్నంతటినీ సమీకరించి ఓట్లు వేయించుకో గల్గిన యంత్రాంగం, కార్యకర్తల బలం ఆ పార్టీకి లేవు. కాపులు, ఇతర బిసిలు మనఃస్ఫూర్తిగా ఆ పార్టీని సమర్థించ లేకున్నారు. పాత గాయాలు వారి మనసులో ఇంకా మానలేదు. హరిజనులలోనూ ఎన్టీఆర్ పట్ల విశ్వాసం లేదు.

బిజెపి ఉత్సాహం, ఉత్తరాది ఓటమితో నీరు గారి పోయింది. ప్రత్యామ్నాయ శక్తిగా ఎదగాలన్న వారి ఆశలు, పగటి కలలే అయినాయి. రామమంత్ర జపం ఆంధ్రలో పని చేయలేదు. అంతకంటె ఆకర్షణీయమైన నినాదాన్ని, విశ్వాసం కల్గించే కార్యక్రమాన్ని వారు కని పెట్టలేకున్నారు. సిపిఎం, సిపిఐ పార్టీలు రాష్ట్రంలో మృతప్రాయమే. తెలుగుదేశం కొంగు చాటు బిడ్డలవి. స్వంతంగా ఒక్క నియోజక వర్గంలో గెలుపొందే చేవ వాటికి లేదు.

ఈ పరిస్థితులన్నింటి వల్లా ఏర్పడిన శూన్యాన్ని కాన్షీరాం పూడ్చగలడా? అంతటి పరిణామానికి గ్యారంటీ లేక పోయినా రానున్న ఎన్నికలలో బిఎస్‌పి ప్రభావం విపరీతంగా వుండగలదన్న భయం మాత్రం అందరిలో ఏర్పడుతున్నది. హరిజన గిరిజనులతో పాటు, బిసిలు మైనారిటీలు కాన్షీరాం పట్ల మొగ్గు చూపితే ఎన్నికల ఫలితాలు అనూహితంగా వుంటాయి. కాన్షీరాం పర్యటన జయప్రదమైన క్షణం నుంచి కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు రెండూ బలహీన వర్గాల ప్రజలను ఆకర్షించేందుకు మార్గాలన్వే షిస్తున్నాయి.

## ముఖ్యమంత్రి

( మొదటి పేజీ కొరవ)

చేసిన వారికి ఎట్టి పరిస్థితుల్లో కూడా టిక్కెట్టు ఇవ్వరాదన్న ఫార్ములాను ప్రధానమంత్రి అక్షరాలా అమలు చేశారు.

### చివరి సీటు ఉత్కంఠ

కాంగ్రెస్ పార్టీ నుంచి రాజ్యసభకు మొత్తం అయిదుగుర్ని పంపాల్సి వుండగా కిషోర్ చంద్రదేవ్‌కు కేటాయించిన సీటు మినహా మిగతా నలుగుర్ని 20 వ తేది రాత్రి ప్రకటించారు. అయిదో సీటు పెండింగ్‌లో పెట్టడానికి వెనక ఏదో బలమైన కారణం ఉండే వుంటుందని భావించారు. మాజీముఖ్యమంత్రి ఎన్.జనార్ధన రెడ్డి కోసమే చివరి టిక్కెట్టు అట్టిపెట్టారని అంతా అనుకున్నారు. ముఖ్యమంత్రి లాబీలో అయితే ఎక్కడలేని ఉత్కంఠ. 21వ తేది మధ్యాహ్నం ప్రధాని నివాసం నుంచి ఫోన్ వచ్చింది. చివరి సీటు షెడ్యూల్ కులాలకు గానీ, షెడ్యూల్ తెగలకు గాని ఇవ్వాలను కుంటున్నారు. మీరు ఎవరి పేరైనా సిఫార్సు చేస్తారా అని ఢిల్లీ నుంచి ముఖ్యమంత్రికి ఫోన్ వచ్చింది. ముఖ్యమంత్రి వర్గీయుల్లో గుడ్డిలో మెల్లలాగా ఢిల్లీ ఫోన్ కొంత ఊరట కలిగించింది. ముఖ్యమంత్రి వర్గీయులు కిషోర్ చంద్రదేవ్ పేరు సిఫార్సు చేశారు. ముఖ్యమంత్రి సరేనన్నాడు. నిన్న మొన్నటిదాకా కాంగ్రెస్ (ఎస్)లో వున్న కిషోర్ చంద్రదేవ్‌కు సిఫార్సు చేసి ముఖ్యమంత్రి నాలుక్కరుచు కున్నాడు. ముఖ్యంగా పార్టీని నమ్ముకున్న వారందరికీ ముఖ్యమంత్రి చర్య మనస్తాపానికి గురిచేసింది. గతంలో విజయభాస్కర రెడ్డి, రెడ్డి కాంగ్రెస్‌లో వున్నప్పుడు కిషోర్ చంద్రదేవ్ కూడా రెడ్డి కాంగ్రెస్‌లోనే వున్నారు.

## కాపుల కన్నెర

( మొదటి పేజీ కొరవ)

చెందిన సింగం బసవపున్నయ్యను గానీ, మంత్రి హరిరామజోగయ్యను గానీ పిసిసి అధ్యక్షుడిగా చేయాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. వీరిద్దరూ కూడా గతంలో పార్టీలు ఫిరాయించిన వారే, బసవ పున్నయ్య జనతాపార్టీలో ప్రముఖ పాత్ర వహించగా, హరిరామ జోగయ్య తెలుగు దేశంలో మంత్రిగా వుండి ఢిల్లీ కోటపై పచ్చజెండా ఎగరేస్తాం అంటూ ప్రగల్బాలు పలికి వున్నాడు. పార్టీని మొదటి నుంచి నమ్ముకున్న వారిని కాదని ఫిరాయింపు దార్లకు ముఖ్యమంత్రి పదవులిప్పిస్తున్నాడని విధేయ కాంగ్రెస్ నాయకులు మొత్తుకుంటున్నారు. ఇలా వుండగా పిసిసి అధ్యక్ష పీఠం నుంచి తులసీ దాస్‌ను తప్పించే విషయాన్ని ముఖ్యమంత్రి ఇటీవల ఢిల్లీ పర్యటనలో ప్రధాన మంత్రి వద్ద ప్రస్తావించగా "చూద్దాం. తొందరేముంది ముందు రాజ్యసభ ఎన్నికలు కానివ్వండి అంటూ దాటవేశారట. దీంతో పిసిసి అధ్యక్షుడి ఎంపికలో కూడా ముఖ్యమంత్రి మాట చెల్లకుండా పోతుందా? అన్న అనుమానాలు తలెత్తాయి. పిసిసి అధ్యక్షుడ్ని కూడా అధిష్టానమే ఎంపిక చేసే పక్షంలో ముఖ్యమంత్రి పదవి కేవలం అలంకార ప్రాయంగా మారుతుంది. సాధారణంగా రాజ్యసభ టిక్కెట్లలో ముఖ్యమంత్రి కోటా కింద కనీసం ఒక్కటైనా ఇవ్వడం ఆనవాయితీ. గతంలో చెన్నారెడ్డి, జనార్ధన రెడ్డి ముఖ్యమంత్రులుగా వున్నప్పుడు తమసొంత మనుషులకు వాళ్ళు రాజ్యసభ టిక్కెట్లు ఇప్పించుకో గలిగారు. కానీ కోట్ల వారి వంతువచ్చే సరికి అధిష్టానం ఆ ఆనవాయితీని దాటవేసింది.

## పంచాంగము

శుక్రమౌఢ్యమి జరుగుచున్నది

### జనవరి తిథులు

పుష్యబహుళ

తే 29శని విదియ సా.గ. 4.25 వ
తే 30ఆది తదియ సా.గ. 2.55 వ
తే 31సోమ చతుర్థి ప.గ. 12.50 వ

ఫిబ్రవరి తిథులు

తే 1 మంగళ పంచమి ఉ.గ. 10.40 వ
తే 2 బుధ షష్ఠి ఉ.గ. 8.20 వ
మిగులు పూర్తిగా సప్తమి
తే 3 గురు అష్టమి రా.గ. 3.40 వ
తే 4 శుక్ర నవమి రా.గ. 1.25 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ

# అంగరక్షకుడు ఆకర్షణీయం!

ఈనాటి రాజకీయ వాతావరణంలో అవినీతిని స్మరించే ప్రజా ప్రతినిధులే ఎక్కువగా వున్నారు. చాలా కొద్ది మందే నీతి మీద నిలబడ్డ వారు. నీతిని నమ్ముకున్న వారికి ఈనాడు రక్షణ లేదు. బాధ్యతాయుతమైన పదవుల్లో వున్న అతికొద్దిమంది నిజాయితీ పరులను కాపాడేందుకు అంగరక్షకుడుగా మారి తాను విశ్వసించిన సిద్ధాంతాల కోసం న్యాయసమ్మతంగా, వీరోచితంగా పోరాడి గెలిచి నిలిచిన ఒక ప్రజాహితుడు, దేశభక్తి తత్పరుడి కథ. కె.యస్. రామారావు నిర్మించిన "అంగరక్షకుడు" చిత్రం. ఇందులో ఒక మంచి ముఖ్యమంత్రిని, అన్ని విషపు కోరల నుంచి ఒక నీతి, నిజాయితీ గల పోలీస్ ఆఫీసర్ కాపాడుతాడు. ఈ ముఖ్య కథాంశం ఇది వరలో విజయం సాధించలేకపోయాం. చిత్రాన్ని క్లిష్ట చేస్తుంది.

ఈ చిత్రానికి సంబంధించిన కథ హీరో రాజశేఖర్ కూర్చాడు. అందులో సమకాల రాజకీయాలను చొప్పించాడు. రాజకీయ పదవుల్లో వున్నవారిలో అటువంటి వారు ఇటు

**గ్రిద్దలూరు గోపాలరావు**

చెడ్డవారు వున్నట్టు చూపాడు. అదే విధంగా పోలీస్ శాఖలో ప్రజారక్షణే బాధ్యతగా ఉద్యోగం నిర్వహించే వారున్నారు. కాని అవినీతి పరులైన పైఅధికార్ల ఒత్తిడికి లొంగిపోయి నీతిని, నిజాయితీని బలిపెట్టుకునే వాళ్ళు ఎక్కువగా వున్నారని చెప్పారు. నీతిపరులైన పోలీస్ అధికారులకు మంత్రి పదవుల్లో వున్న మంచివారు అండగా నిలచి ప్రోత్సహించాలని; అప్పుడే ప్రజాక్షేమం, దేశాభివృద్ధి వర్ధిల్లుతాయని ఖచ్చితంగా చెప్పాడు.

దర్శకుడు కోడి మొత్తం చిత్రాన్ని ఆసక్తి దాయకంగా నడిపించాడు. సమకాల రాజకీయాలను చూపటంలో నాణ్యత కనపరిచాడు. సామాజిక స్పృహతో కూడుకున్న కొన్ని అంశాలను కూడా నేర్పుగా

**చిత్ర సమీక్షలు**

రూపొందించాడు. విశ్వనాథ్ పేరుతో సాగిన అంగరక్షకుడి పాత్రను ఆకర్షణీయంగా మలిచాడు. ఈ పాత్రను సాధారణ స్థాయినుంచి అంగరక్షకుడి స్థాయికి ఎదిగించిన తీరు అందులోని జోరు కొత్త పద్ధతిలో సాగించాడు. చెరలో చిక్కుకున్న ముఖ్యమంత్రి కూతురు మీనాదేవిని, మరికొందరిని అంగరక్షకుడు విశ్వనాథ్ విడిపించిన దృశ్యం చిత్రీకరణ బాగుంది. మంచి ముఖ్యమంత్రికే కాదు ఈ అంగరక్షకుడు, లోకంలోని మంచితనానికి, మానవతకు,

కొరవ 11 పేజీలో

# గోవిందా... గోవింద గోవింద కొట్టింది!

ఒకప్పటి సంచలన దర్శకుడు రాం గోపాల్ వర్మ తన కెరీర్‌లో తీసిన పరమ చెత్త చిత్రంగా "గోవిందా, గోవింద" నిలిచిపోతుంది. చిత్రం చూస్తున్న ప్రేక్షకులు అది సాంఘిక చిత్రమో, పౌరాణిక చిత్రమో అర్థం కాని డోలాయమాన స్థితిలోకి వెళ్లిపోతారు. చివరి సన్నివేశాలలో విఠలాచార్య బాణీ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ప్రపంచంలోని ఆధ్యాత్మిక జీవులకు ఆగ్రహం కలిగించేలా వెంకటేశ్వర స్వామి కిరీటం దొంగతనాన్ని ప్రధాన ఇతివృత్తంగా ఎంచుకొన్నా, కథనాన్ని నడపడంలో వెనుకబడిపోయాడు. సహజత్వంగా సినిమాలు తీస్తాడని పేరు గడించిన దర్శకుడు శర్మ ఇటువంటి చచ్చు కథను ఎలా ఎంచుకున్నాడో అర్థమై చావదు.

బ్యాంకాక్ నుండి భారతదేశానికి విమానంలో వచ్చిన హీరోయిన్ డొక్కు ఆర్టీసి బస్సు ఎక్కడ ఎక్కిందో అర్థం కాదు. తిరుపతి బస్‌స్టేషన్‌లో దిగడం హీరో పరిచయం కోసమేనన్నట్టుంది. విదేశాల నుండి ఒంటరిగా వచ్చిన యువతి బస్‌స్టేషన్‌కు 20 అడుగుల దూరంలో వున్న లాడ్జికి డొక్కు కారులో వెళ్లినందుకు 2 వేలు ఫేర్ ఇవ్వడం వంటి సీన్లు వర్మలాంటి దర్శకుడు చూపడాన్ని ఏమనాలో అర్థం కాదు. ప్రపంచ ప్రసిద్ధి గాంచిన ఒక పుణ్య క్షేత్రంలోని అవతారమూర్తి కిరీటాన్ని పట్టుమని పదిమంది కూడా లేని

**అల్లూరు రహీం**

ముఠా స్మోకింగ్ బాంబ్స్ వేసి తీసుకెళ్లడం విడ్డూరమే! ఇటువంటి అంతర్జాతీయ దోపిడీపై దర్యాప్తు చేయను హీరో, ఒక అధికారి మాత్రమే విదేశాలకు పోవడం దర్శకుని అసమర్థతను ఎత్తి చూపుతుంది. సహజంగా విదేశాల్లో పరిశోధన చేయను "రా" వంటి సంస్థ టీం అక్కడి ప్రభుత్వ అధికారులతో కలసి దర్యాప్తు చేయడం జరుగుతుంది. అంతేగాని ఒంటరి అధికారి హీరోతో కలసి క్లబ్‌కు పోవడం, అడ్రస్ అడగగానే ముఠా వాళ్లు కసుక్కున పొడవడం, హీరో గమ్మున చేతులు

కొరవ 11 పేజీలో



# నిర్మాతలను హడలెత్తించిన చిరంజీవి చిత్ర వైఫల్యం

చిరంజీవితోపాటు అరి తెరిన తారలు, సత్యానంద్ రచన, విద్యాసాగర్ సంగీతం, మీదు మిక్కిలి కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో విడుదలైన "ముగ్గురు మొనగాళ్ళు" చిత్రం నిరాశ కల్గించడంతో ఇతర నిర్మాతలు చాలామందికి విపరీతమైన గాభరా కల్గింది. ఒకే మూసలో పోసినటువంటి కథ, నటనకు ప్రేక్షకులు విసుగెత్తి పోయారన్నది నిర్వివాదాంశం. దీనితో తామే సినిమా పండితులమనుకుని తామేం చేస్తే అదే ఘనకార్యమని విర్రవిగే వారికి కాస్త కనువిప్పు కల్గితే మంచిది.

## కృష్ణ "నెంబర్‌వన్"

కృష్ణ నటించిన "నెంబర్‌వన్" చిత్రం ఎందుకు సూపర్‌హిట్ అయ్యిందో పలువురు ప్రముఖులకు బోధపడటం లేదు. అదే బాణీలో కథలు సమకూర్చుకుంటే శ్రేయస్కరమని భావిస్తున్నారు మరికొందరు. మొత్తం మీద కాలచక్రాన్ని తిప్పుకున్న ఘటికుడనిపించు కున్నాడు కృష్ణ. ఈయన ఊపు మరికొంతకాలం ఉంటుంది. ఈయన చిత్రాలు కూడా ధోరణి మార్చుకోక పోతే ఈయనకూ చిరంజీవి పరిస్థితే.

## దర్శక నిర్మాతల వెంటబడుతున్న ఖుష్బూ

ఖుష్బూ విగ్రహంతో ఒక వెర్రి అభిమాని ఆలయాన్ని నిర్మించాడు. అప్పటి నుంచి ఆమె పతనాన్ని ఆశించారెందరో. తమిళ చిత్ర పరిశ్రమ క్రమక్రమంగా తిరస్కరిస్తూండే సరికి ఖుష్బూ తెలుగు దర్శక నిర్మాతలను ఆశ్రయించక తప్పలేదు. రెండేళ్ళ క్రితం ఒక సుప్రసిద్ధ తెలుగు నిర్మాత తన చిత్రంలో నటించమని కోరితే, "నాకు కథ పూర్తిగా చెప్పాలి. నేను ఏవైనా మార్పులు సూచిస్తే చేయాలి. నేనడిగినంత పారితోషిక మివ్వాలి." వంటి షరతులు పెట్టిన ఖుష్బూ ఇటీవల స్వయంగా ఆ నిర్మాతను కలుసుకుని, "ఆ రోజు జరిగింది మనసులో పెట్టుకోకండి. కథ గురించి నేను అడగను. ఎంత పారితోషికం ఇచ్చినా పుచ్చుకుంటాను. మీ చిత్రంలో నాకు ఛాన్స్ ఇవ్వండి." అని వేడుకుందట, ఆమె కన్నా నాలుగాకులు ఎక్కువ చదువుకున్నవాడు ఆ నిర్మాత. అందుచేత "చూద్దాం అవకాశం వచ్చినప్పుడు కబురు చేస్తా." అని బిగువు చూపించాడట. తన ఈ పరిస్థితికి కారణం తనకు హీరో ప్రభుతో వివాహం జరిగినట్లు ఒక తమిళ దినపత్రిక ప్రచురించిన తప్పుడు వార్తేనని ఆ పత్రికాధిపతిని కుష్బూ ఆడిపోసుకుంటోందట. ఎవరి కర్మకు ఎవరు బాధ్యులు!

కార్మికుల ఐక్యతను నొక్కి చెబుతున్న రైల్వేకూలీ మమ్ముట్టి

## కాంతారావు, రాజనాలతో "జంతర్ మంతర్"

ఒకప్పుడు విఠలాచార్య, ఎస్. భావనారాయణ విపరీతంగా నిర్మించిన జానపద చిత్రాలలో నాయకుడుగా, ఖల్‌నాయకుడుగా నటించిన కాంతారావు, రాజనాల చాలాకాలం తర్వాత శ్రీ సాయినాథ ఆర్ట్ క్రియేషన్స్ "జంతర్ మంతర్" చిత్రంలో కలిసి నటిస్తున్నారు. "తమ లోకంలో లేని ఒక అపూర్వమైన శక్తి భూలోకంలో ఉందని తెలిసి దాన్ని హస్తగతం చేసుకోవడానికి ఇంద్రలోకం నుంచి ఒక దేవకన్య భూలోకానికి పంపబడుతుందనీ, ఆ శక్తిని కైవశం చేసుకోవడానికి ఆ దేవకన్య పడేపాట్లు వినోదాత్మకంగా ఉంటాయనీ దర్శకుడు భరత్ తెలిపారు. "షోలే" లోని గబ్బర్‌సింగ్‌ను పోలిన పాత్రలో బాబూమోహన్ ఈ చిత్రంలో తొలిసారిగా విలన్‌గా నటించడం విశేషం. శ్రీకాంత్, చిన్నా, సురభి, దుర్గ, ఎ.వి.యస్, దేవదాస్ కనకాల, తనికెళ్ళ భరణి, విద్యాసాగర్, రమాప్రభ,

కొరవ 11 పేజీలో

# సిల్క్‌స్మిత వైరాగ్యం!

ఇటీవల మద్రాసుకు విచ్చేసిన మదర్ థెరిసాను చూడడానికి సిల్క్‌స్మిత ఎంత ప్రయత్నించినా వీలుకాకపోయిందట. "ఏమి షూటింగ్‌లో ఏమో, ఒక్కోసారి వారాలపాటు ఖాళీగా ఉంటాను. ఒక్కోసారి ఊపిరి సల్పకుండా షూటింగ్‌లు. ఎంత సంపాదిస్తే ఏం లాభం? పోయేటప్పుడు నేను ఆస్తి పాస్తులన్నీ మోసుకెళ్తానా? మదర్ థెరిసాలా ప్రజాసేవ చేయాలి. గతపాయన అని కొంతమంది తోకలొస్తే డాక్టర్ 'రాధాకృష్ణతో నా పెళ్ళి ఎప్పుడని ప్రపంచం ఎవరో ఒకరు అడుగుతుంటారు. అప్పుడే ఏం తొందర - అని ఇదివరకు అనేదాన్ని. ఇప్పుడు అలా అనలేనుగా? ఎప్పుడు తలచుకుంటే అప్పుడు పెళ్ళి చేసుకోవచ్చు. పిల్లల్ని కనవచ్చు. కాని, మదర్ థెరిసాలా లోకానికి సేవ చేస్తే మనసుకు కలిగే ఆ తృప్తి వేరు కదా? చచ్చిన తర్వాత కూడా జీవించాలంటే మదర్ థెరిసాలా సేవ చేయాలి. అప్పుడే జీవితం సార్థకమవుతుంది." ఇలా సిల్క్‌స్మిత ఇటీవల వేదాంత ధోరణిలో మాట్లాడుతుంటే విస్తుపోకుండా ఉంటారా ఎవరైనా? మొత్తం మీద భలే వైరాగ్యం!



బి. వెంకయ్య గేయ [illegible] పక్కన వెంకటగిరి వి. సాయికృష్ణ యాచేంద్ర.

## నెల్లూరు వ్యాపారి

(4 పేజీ కొరవ)

సేకరించుటలో తనెంతో సహకరించాడని మెకంజీ దొర బొర్రయ్య సేవలను కొనియాడారు. బొర్రయ్యకు వారసుడైన కావలి వెంకట లక్ష్మయ్య 1828 వ సం.లో చెన్నపురి లిటరరీ సంఘ స్థాపనకు, ఆ తర్వాత దాని వృద్ధికి కారకుడు. ఈ సంస్థలోని భాగమే తర్వాత వెలసిన చెన్నపురి ఓరియంటల్ వ్రాతప్రతుల గ్రంథాలయం. అప్పటి ఆంగ్లేయ ఉన్నతాధికారులతో ఈయనకు సన్నిహిత సంబంధాలున్నట్లు తెలుస్తున్నది. బ్రాహ్మణులైన పండితులు, వర్తకులైన వైశ్యులు, వాణిజ్యం నెరపిన రెడ్లు, నాయుళ్లు చాలా మంది నెల్లూరీయులు చెన్నపురికి చేరినట్లు అనేక ఆధారాలున్నాయి. కానీ వీరి అంతస్సంబంధాలెటువంటివి? ఎందు వల్ల వీరు తమలో తాము కలహించుకొని ఆంగ్లేయుల నాశ్రయించారు? వీరిలో ఐకమత్యం లేక పోవడానికి ముఖ్య కారణమేమిటి? అనే ప్రశ్నలకు తృప్తికరమైన సుదృఢమైన సమాధానాలు లభించలేదు.

క్రీ.శ. 1698 నుంచి 1709 దాకా చెన్నపురికి గవర్నరుగా నుండిన థామస్ పిట్టు అనే ఆంగ్లేయునికి విలువైన సమకూర్చిన సూరప్ప అనే వర్తకుడు నెల్లూరు సీమ వాసియని తెలుస్తుంది. సూరప్ప శ్రేష్ఠి 1605 వ సం. ప్రాంతంలో పిట్టు దొరకు చేర్చిన బృహద్వజ్రము యొక్క బరువు దాదాపు 280 క్యారెట్లనియు, ఒక్కొక్క క్యారెట్టు విలువ సమకాలీన విపణిలో 2000 పౌన్ల నుంచి 3000 పౌన్ల వరకుండినట్లు చార్లెస్ లాజా గ్రంథము, ఇతర రికార్డులు వెల్లడించినవి. చెక్కిన తర్వాత నీ బృహద్వజ్రము దాదాపు 137 క్యారెట్లుగా తరిగినది. ప్రస్తుతము గుంటూరు జిల్లాలో [illegible] కొల్లూరు అనే గ్రామంలో కోహినూరు వజ్రము దొరికినది ప్రసిద్ధి. ఈ గ్రామానికి 40 మైళ్ళ దూరంలో గల పుత్రియాల అనే గ్రామంలో సూరప్ప శ్రేష్ఠి అంటే 1698-1709 మధ్యన సూరప్ప లేటి సమాన హోదాలో మదరాసు నగరంలో వజ్రాల వ్యాపారము చేయు చుండిన వర్తకుడు వెంకట శెట్టి నెల్లూరీయుడా అనే విషయము తెలియదు. కాని థామసు పిట్టు కాలంలో చెన్న పురిలో ధనికులైన గెంటూలు (తెలుగు) వర్తక శ్రేష్ఠులు, వ్యాపారులు చాలమంది నెల్లూరు సీమ నుంచి వలస వెళ్ళినట్లు చెబుతారు. ఈ వజ్రాల ఉదంతాలను చూచినపుడు చాల చోట్ల కృష్ణానది తీర వాసులను గూడా నెల్లూరు సీమ వారుగా వ్యవహరించినట్లు గోచరిస్తుంది. చాల దస్తావేజులలోను, వ్యాపార పట్టికల లోనూ అందరు వ్యక్తుల ఇంటి పేరు లేక పోవుట ఒక సమస్య కాగా, ఒకే ఇంటి పేరు కల్గిన వారందరు ఒకే గ్రామానికి లేక జిల్లాకు చెందిన వారని నిర్ణయించలేకున్నారు. కొందరు ముస్లిములు నెల్లూరు సీమకు చెందిన స్త్రీలను వివాహ మాడి చెన్నపురిలో నెల్లూరీయుల పేరు మీద చెలామణి అయినట్లున్నది. నెల్లూరీయుల వృత్తులుగా ప్రసిద్ధి పడసిన ధాన్యము, కూరగాయలు, నగలు మొదలగు వ్యాపారాలలో సౌలభ్య నిమిత్తమై చాలా మంది ఇతరులు అంటే నెల్లూరే తరులు కూడా నెల్లూరీయులుగా చెప్పుకొని ఉండ వచ్చును. కాబట్టి అసలు శిసలైన నెల్లూరి వారెవరు, వృత్తి, వ్యాపారం వివాహాల రీత్యా వచ్చిన వ్యవహారిక నెల్లూరీయుల వివరనేది తెలిసి కొనుట కష్టము.

దుబాషిత్వము (దుబాషితనము, దుబాషీగిరి) ను అధికార, అనధికార హోదాలలో నిర్వహించుచునే ఐరోపియా వ్యాపార కంపెనీలతో నగరు, వ్యాపార లావాదేవీలలో అపారాను భవాన్ని గడించిన నెల్లూరు సీమ బ్రాహ్మణులలో చెన్నపురి దస్త్రావేజుల్లో ప్రసిద్ధుడు అవధానము పాపయ్య దుబాషి ముఖ్యుడు. పాపయ్య కుటుంబము వారు వజ్రాల సూరప్ప కుటుంబానికి బాగా తెలిసిన వారు. పాపయ్య గారి పూర్వీకులొకాయన 18 వ శతాబ్దారంభంలో చెన్నపురికి చేరెను. ఈయన పేరు గూడ పాపయ్య. బహు భాషాజ్ఞాని, పదవీ వ్యామోహము కల్గిన వారు. ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వములో ప్రధాన దుబాషిత్వము కొరకై తన మిత్రుడైన వజ్రాల వ్యాపారి సూరప్ప మధ్య వర్తిత్వము నెరపగా అప్పటి చెన్నపురి గవర్నరు పిట్టుకు (నెల్లూరు) పాపయ్య 500 పగోడాల లంచాన్ని ఇచ్చినట్లుగా 1719 వ సంవత్సరము ఆగస్టు నెలలో చెన్నపురిలో ఆరోపింప బడెను. అయితే ఈ నెల్లూరు పాపయ్య దాదాపు 75 సం.ల తర్వాత పేరెన్నిక పడసిన అవధానము పాపయ్య గారి పూర్వీకుడా, లేక అవధానము పాపయ్య గారి ఈయన తండ్రి గాని 18 వ శతాబ్దపు టుత్తరార్థంలో నెల్లూరు సీమ నుంచి చెన్నపురికి చేరినారా అనే విషయం ఖచ్చితంగా తెలియదు. పాపయ్య అనే పేరు గల్గిన బ్రాహ్మణ పండితులు, ముఖ్యంగా నెల్లూరీయులు, చాలా మంది దుబాషీలు 18 వ శతాబ్దిలో చెన్నపురిలో వాసికెక్కుటచే వీరెవరెవరో తేల్చి చెప్పుట కష్టము. 1709 వ సం.లో ప్రధాన దుబాషిత్వాన్ని పొందిన పాపయ్య సంస్కృతాంధ్ర, పర్షియన్ భాషలలో పండితుడు. ఈ భాషలను ఆంగ్లంలోనికి, తమిళంలోనికి అనువుగా తర్జుమా చేయగల్గిన ప్రజ్ఞాశాలి. 1699 వ సం.లో చెన్నపురి కరణము ఉద్యోగము రద్దయినపుడు చెన్నపురి పెద్ద నాయకుని చేత ప్రభుత్వం వారికి దుబాషీగా సిఫారసు చేయబడిన పాపయ్య కూడా ఇతడే కావచ్చును. ప్రభుత్వపు యంత్రాంగంలో క్రమంగా పాపయ్య హోదా పెరిగినది. 1710 తర్వాత పాపయ్యకు ఛత్రమాన హోదా లభించెను. అంటే, పాపయ్య ఎచ్చటికి వెళ్లినా కంపెనీ ప్రభుత్వపు సేవకుడొకడు ఆయన తలపై ప్రత్యేకమైన హోదా చిహ్నమైన కుచ్చుల గొడుగును పట్టవలెను. ఈయన అనుచరులు కొందరు పన్నిన కుట్రల మూలంగా పాపయ్య మీద కొన్ని స్వల్ప నిందలు వచ్చినవి. 1717 వ సం.లో ఈయన మర్యాదలను కొన్నిటిని ప్రభుత్వము తొలగించెను. అయితే పాపయ్య నిర్దోషి అని తేలుటతో తిరిగి 1720 వ సం.లో అన్ని హోదాలో సమకూర్చారు. తదుపరి రెండు దశాబ్దాల తరువాత పాపయ్య వివరాలు నాకేమియు లభించలేదు. కాని 1740 సం. దశకంలో మనకు దస్తావేజులలో ఒక నెల్లూరు పాపయ్య తటస్థిస్తాడు. ఈయనను పాపయ్య బ్రాహ్మణుడు అని గూడ పిలిచిరి. ఈయన తన యొక్క నిశితమైన ప్రావీణ్యాభిప్రాయాలను ధైర్యంగా వెలిబుచ్చ గల్గిన దిట్ట. 1743వ సం.లో అన్వరుద్దీన్ ఖాన్ ఆర్కాటుకు క్రొత్తగా నవాబైన తరుణంలో పరిశీలనా వ్యాఖ్యలను చేయవలసిందిగా ఆంగ్లేయ కంపెనీ వారు పాపయ్యను కోరిరి. అందుకు స్పందిస్తూ పాపయ్య నవాబు పాలనను పరిశీలించెను. అది చాలా చేవ్వగాను, శిల్లని రహితంగాను, కఠినంగాను, దురాశా పూరితంగాను, అన్యాయ మిళితంగాను ఉన్నదని 1744వ సం.లో పాపయ్య వ్యాఖ్యానించెను. వ్యాపారులైన శెట్లు, రెడ్లు పాపయ్య తోటి సంబంధములను కల్గియుండిరే కాని, నవాబును మాత్రము దుయ్యబట్టలేదు. నవాబు కొలువులో తమ సన్నిహితులు కొందరు నౌకర్లలో ఉండడమే ఇందుకు కారణమై యుండవచ్చును. నవాబు కంటే తాము మెరుగుగా పాలించ గలమని చెప్పుచున్న ఆంగ్లేయులకు స్థానికుల యొక్క మద్దతు దైవమిచ్చిన వరంగా పనిచేసినది. కాని యిట్టి స్వర్ణావకాశాన్ని ప్రక్కనే కాచుకొనియున్న ఫ్రెంచి వారు కబళించగలరనే భయము మాత్రము ఆంగ్లేయులను వీడలేదు. ఇందులో బాగంగానే వీరు తెలుగు వారిని వీలైనంత వరకు పాండిచ్చేరికి చేరకుండ చూచుటకు ప్రయత్నించిరి. అయితే ఇట్టి విషయాల మీద ప్రత్యక్ష సాక్ష్యాధారాలు స్వల్పము.

వీరిలో అత్యంత ప్రసిద్ధికెక్కిన అవధానము పాపయ్యను గూర్చి చాలా వివరాలు లభించుచున్నవి. ఈయన 18 వ శతాబ్దపుటుత్తర భాగంలో చెన్నపురి వాసి. అచ్చట ఎగుమతి-దిగుమతి (Sea customes) సుంకాల గుమస్తాగా చేరాడు. వ్యాపారం చేయుచునే చాలా భాషలను అభ్యసించాడు. కొంత ధనాన్ని కూడబెట్టి కొన్ని వ్యాపార నౌకలను కొనుగోలు చేసాడు. క్రమేణ స్వంత వ్యాపారాన్ని పెంపొందించి 1790 సం.రానికి చెన్నపురిలో గణనీయ వ్యాపారిగా పేరు పొందెను. నెల్లూరు, చెంగల్పట్టు జిల్లాల్లో అపారమైన భూమిని సంపాదించి, తిరునల్వేలికి ప్రభుత్వ శిస్తు వసూలుదారు (Revenue farmer)గా నియమింప బడెను. ఆనాడు చెన్నపురిలో వ్యాపార సంస్థలుగా నుండిన ప్రైవేటు ఏజన్సీ హౌసు (Private Agency Houses)ల్లో పాపయ్యకు చాలా ప్రాముఖ్య ముండెను. సమకాలీన చెన్నపురి పంచాంగాల (Madras Almanacs)ను బట్టి చూస్తే పాపయ్య ధనికుడే గాక బ్రిటిషు ప్రభుత్వానికి ఆర్కాటు నవాబుకు కూడా ఆర్థిక నిపుణుడుగా వ్యవహరించినట్లు తెలిస్తుంది. ఈయన 1805 వ సం.లో ఏషియాటిక్ బ్యాంకును స్థాపించిన నల్గురిలో ప్రధాన డైరెక్టరు. కర్ణాటక బ్యాంకు, మద్రాసు బ్యాంకుల్లో ఈయనకు వాటా సంబంధాలుండినట్లు అప్పటి మద్రాసు ప్రభుత్వపు పబ్లిక్ కన్సల్టేషన్ రికార్డులు తెలుపు చున్నవి. ఆర్కాటు నవాబుకు తాను స్వయంగా అప్పుల నందించియు, వేరే వారి నుండి నవాబుకు అవసరమైన అప్పులను ఏర్పాటు చేసియు ఇతడు నవాబు గారి మన్ననలను పొందాడు. ఇతని ఉన్నతిని సహించలేని చెన్నపురి స్థానికులు కొందరు నవాబు వైపు నుంచి, కంపెనీ వారి నుండి పాపయ్యకు చాలా సమస్యలను సృష్టించు చుండిరి. ఇట్టి కుతంత్రాలలో నిందితుడుగా 1789-1790 సం.లో పాపయ్యను, మరి కొందరిని వీరు ఇరికించిరి. అధిక మొత్తాల సొమ్మును మోసం చేసారన్న ఆరోపణలతో చిక్కుకున్న పాపయ్య జీవితాంతము వరకు కోలు కొనుట కష్టతరమాయెను.

ఇంకా వుంది.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

వీరి పరిపాలన చూస్తాము-నాయిదాలు మించిన అప్పులు అసలు రూ. 93,000లు-వడ్డీ రూ. 22,000లు ఉన్నట్లు తెల్తున్నది. అంటే సకాలానికి వసూలు చేయక మొగమాటాలు, బంధుత్వాలు, అడ్డు వచ్చి నిల్చిన బాపతని అర్థం. ఉప నిబంధనలకు విరుద్ధంగా బ్యాంకు డబ్బు కొంత ఖర్చు అయినట్లు కనపడుతుంది. కొన్ని ఋణాలు బినామీగా కూడా వున్నట్లు తెలుస్తుంది. వీరిచేత గాక కో.ఆ.ఇన్స్పెక్టరు గారిని నియమించ వలసినట్లు గూడా ఏర్పడింది. చూస్తే బ్యాంకు పాలన చాలా లోప భూయిష్టంగా గూడా ఉన్నది.

కావున రేపటి ఎన్నికలలో మంచి డైరెక్టర్లను ఎన్నుకొని బ్యాంకు పాలనను బాగుచేయ వలసినదిగా మహాసభ వారిని కోరుచున్నాము.

### పెళ్లిళ్ల పురాణం

శ్రీ తిక్కవరపు రామిరెడ్డి గారి 3వ కుమార్తె శ్రీమతి అనసూయాదేవి గారికిని, చిత్తూరు జిల్లా మదనపల్లె తాలూకా తంబళ్లపల్లె వాస్తవ్యులు స్వర్గీయ నారాయణరెడ్డిగారి కుమారుడు శ్రీ టి.యన్.రఘునాథరెడ్డి గారికిని, 28-2-44 తేదీ నెల్లూరులో పాణిగ్రహణ మహోత్సవం జరుగును.

వరుని తండ్రి 10, 12 సం. తాలూకా బోర్డు ప్రెసిడెంటు గిరి చేశాడు. వరుడు బి.ఎ.- రాచకీయంగా కాంగ్రెసు గోత్రియుడు, కాశీలో హిందూ యూనివర్శిటీలో చదువుతూ అరెస్టయి మిర్జాపూర్ జైలులో 8 మాసాలు శిక్ష అనుభవించిన వ్యక్తి.

వధువు ఇంటర్ పరీక్షయి, ఆంధ్ర యూనివర్శిటీ బి.ఎ పరీక్షకు చదువుతున్న విజ్ఞానవతి. ఈమెది కాంగ్రెసు కులమే. గత సంవత్సరం 3 మాసాలు జైలుశిక్ష అనుభవించిన చరిత్రే చివరాధ్యాయం.

వధూవరులు పంట, పాకనాటి తెగ కలయికయినా రాచకీయంగా ఒక కాంగ్రెసు కులీనులే గావడం అదృష్టం. ఇంతకూ సంకల్ప బలం.

### ముఖ్యవార్తలు

#### రంగాగారి జైలు మార్పు

ఆచార్య రంగా గారిని అమరావతి (మధ్య రాష్ట్రాలు) జైలునుంచి తంజావూరు జైలుకు 21 తేదీ ఎక్స్‌ప్రెస్‌లో తీసుకువెళ్లారు.

#### సినిమా

నెల్లూరు వినాయక సినిమాలో కృష్ణప్రేమ ఫిబ్రవరిలో విడుదల



రేబాల పట్టాభిరామరెడ్డి జయంతి సభలో రొటేరియన్ కొండా బలరామిరెడ్డి చేత సన్మానింప బడిన నేలనూతల రామమూర్తి, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, వర్ధమాన సమాజం కార్యదర్శి బి.వి. నరసింహం పక్కన వున్నారు.

## నెల్లూరు సంగతులు (4 పేజీ కొరవ)

ప్రదర్శనలు పలువుర్ని ఆకట్టుకున్నాయి. జిల్లా రెవిన్యూ అధికారి జీ. నారాయణ, ఆర్డీవో ప్రసాదరావు, డి.పి.ఆర్.ఒ. రాజగోపాల్, వేణుగోపాల స్వామి డిగ్రీ కళాశాల విద్యార్థులు సద్భావన యువతి, యువకుల వెంట పట్టణ మంతా తిరిగారు.

### 12, 13, 14 తేదీల్లో వ్యవసాయ, పశుప్రదర్శన

వ్యవసాయ, వుద్యానవన, పట్టు పరిశ్రమ, మత్స్య పరిశ్రమలు సంయుక్తంగా ఫిబ్రవరి 12,13,14 తేదీల్లో చర్చిగ్రౌండ్సులో వ్యవసాయ పశు ప్రదర్శన ఏర్పాటు చేస్తున్నారు. ప్రదర్శనలో వివిధ పంటల అత్యుత్తమ ఉత్పత్తులతో పాటు జాతి పశువులు, పెంపుడు కుక్కల ప్రదర్శన నిర్వహించియోగ్యమైన వాటికి బహుమతిలిస్తారని సంయుక్త వ్యవసాయ సంచాలకులు ఎ. రాజేంద్ర ప్రసాద్ తెలియజేస్తున్నారు. పూల ప్రదర్శన ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తారట. ప్రదర్శనలో తమ ఉత్పత్తులను ప్రదర్శింప కుతూహలం గలవారు 11 తేది సాయంత్రం నుండి చర్చి గ్రౌండ్సులో నమోదు చేసుకోవాలి.

### రేబాల పట్టాభి రామరెడ్డి జయంతి సభ

స్వర్గీయ రేబాల పట్టాభి రామరెడ్డి 83 వ జయంతి సభను 20 తేది వర్ధమాన సమాజం టౌన్‌హాల్‌లో శ్రీ కొండా బలరామి రెడ్డి అధ్యక్షతన నిర్వహించింది. పట్టణంలో పలు విద్యా, వైద్య, సాహితీ సాంస్కృతిక, గ్రంథాలయాల అభివృద్ధికి రేబాల కుటుంబంవారు అంకిత భావంతో కృషి చేసినట్లు బలరామి రెడ్డి చెప్పారు. వుపన్యాసకునిగా విచ్చేసిన నేలనూతల రామమూర్తి భగవత్తత్వము మోక్షము అనే అంశంపై మాట్లాడారు. సిద్ధాంత ప్రతిపాదక గ్రంథాలైన వేదాలు, ఉపనిషత్తులు, బైబిల్, ఖురాన్‌లలో ఏ పాటి పరిచయం సంపాదించ కుండానే కల్పిత కావ్యాలను చదివి పరమత దూషణకు పూనుకోవడం ఫ్యాషన్‌గా మారింది. కొన్ని వందల సంవత్సరాలుగా పలుదేశాలలో పలువురి పండితుల ప్రశంస నందుకొన్న వివిధ శాఖలు నశించి పోవడం బాధాకర మన్నారు. భగవంతుడు అనగానే అర్ధంకాని వాడో భయంకరుడో అనే భ్రమలు విడిచి పెట్టి నిశ్చల చిత్తంతో భక్తితో ఉపాసిస్తే మోక్షం సులభమే నన్నారు. అనంతరం రామమూర్తిని ఆచార్య పిసి రెడ్డి సన్మానించారు. అగస్త్య రెడ్డి వెంకురెడ్డి స్వాగతం పలుకగా సమాజం కార్యదర్శి బి.వి. నరసింహులు వందనాలు చెప్పారు.

### 17 కోట్లు రుణాలిస్తున్న సెంట్రల్ బ్యాంకు

అప్పుల్లో కూరుక పోయివున్న కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకును ఆ వూబినుండి బయటకు లాగి మళ్లీ దానికి పూర్వవైభవం తెచ్చి పెట్టను అహం రహం శ్రమిస్తున్నాడు ఛైర్మన్ శ్రీ వేమారెడ్డి రామచంద్రా రెడ్డి. ఈ సంవత్సరం రికార్డు స్థాయిలో అప్పులను వసూలు చేయడంతోపాటు తిరిగి 17 కోట్ల అప్పులివ్వను రంగం సిద్ధం చేశారు. ఇప్పటికే వసూలయ్యే అవకాశం వున్న 14 శాఖల ద్వారా 14 కోట్లు అప్పులు ఇచ్చేశారట. వీటిలో 6 కోట్లా 40 లక్షలు పంట రుణాలు, నూనెగింజల ఉత్పత్తికి 2 కోట్లా 38 లక్షలు, చేతివృత్తులు, చేనేత వుద్యోగ సహకార సంఘాలకు కోటి 67 లక్షలు మంజూరు చేసినట్లు రామచంద్రారెడ్డి చెప్పారు. ఇవేగాక ఫిల్టర్ పాయింట్లు, ఎలక్ట్రిక్ మోటార్లు, ఆయిల్ ఇంజన్ల కొనుగోలు, పాడి గేదలు, గొర్రెల పెంపకం, పండ్ల తోటల పెంపకానికి రుణాలు ఇచ్చినట్లు బ్యాంక్ జిఎం కోనేరు నాగేశ్వర రావు వివరించారు. బంగారు ఆభరణాలపై 11 లక్షల పైగా అప్పులిచ్చారు. కోవూరు షుగర్ ఫ్యాక్టరీకి 8 కోట్ల రూపాయల నగదు పరపతిని, పాల ఉత్పత్తి దారుల సంఘానికి 3 కోట్ల ఋణాలు ఇవ్వటానికి కూడా నాబార్డ్, ఆప్కాబ్ అనుమతి తీసుకోవటం జరిగిందట. బ్రాంచీల విస్తరణలో భాగంగా వెంకటాచలం బ్రాంచి కొత్తగా ప్రారంభిస్తున్నారు.

### జూనియర్ ఛాంబర్ ప్రమాణ స్వీకారం

నెల్లూరు జూనియర్ ఛాంబర్ అధ్యక్షుడిగా పినాకిని బేవరీస్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శోభన ప్రకాష్ 30 తేది టౌన్‌హాల్‌లో ప్రమాణ స్వీకారం చేస్తారు. ఉపాధ్యక్షునిగా కోట కృష్ణమూర్తి, కార్యదర్శిగా వై. శ్రీనివాసరావు, సహ కార్యదర్శిగా జి.వి. నగేష్, కోశాధికారిగా టి. మోహన్‌రాజ్, హౌస్ బులెటిన్ ఎడిటర్‌గా టి. శ్రీనివాసులు, జేసిరెట్ ఛైర్ పర్సన్‌గా పి. సుధారాణి బాధ్యతలు తీసుకుంటారు. కార్య క్రమానికి సినీ నటుడు నరేష్ విచ్చేస్తారు. జేసిస్ జోన్ కౌన్సిలర్ ఎన్. రమేష్ కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తారు.

> **వర్తమానం**
>
> అధికారాలు<br>
> కేవలం<br>
> కాగితప్పులులు!<br>
> అందుకే<br>
> అవినీతికి<br>
> మొలిచాయి<br>
> అన్ని తలలు!!
>
> \- ఇ. రామకృష్ణారెడ్డి<br>
> మాజీ ఎంఎల్ఏ

### పోస్టల్ కాలని రెసిడెంట్ల సంఘం

ది పోస్టల్ కాలనీ రెసిడెంట్సు వెల్ఫేర్ అసోసియేషన్ కార్యవర్గ ఎన్నికలు ఇటీవల ఏకగ్రీవంగా జరిగాయి. అధ్యక్షునిగా ఎన్. అంజనేయులు, ఉపాధ్యక్షునిగా జె. రమణయ్య, కార్యదర్శిగా జి. రామమూర్తి, సహకార్యదర్శి బి. రాఘవ రావు కోశాధికారిగా ఎన్. వెంకటేశ్వర్లుతో పాటు మరో ఎనిమిది కార్యవర్గ సభ్యులు బాధ్యతలు స్వీకరించారు.

### లేబర్ కాంట్రాక్ట్ సొసైటి

జిల్లా హరిజన, గిరిజన, వడ్డెర లేబర్ కాంట్రాక్టు కోఆపరేటివ్ సొసైటీ కార్యవర్గం ఎన్నిక 17 తేది జరిగింది. వల్లెపు వెంకటేశ్వర్లు అధ్యక్షునిగా, ఉప్పు పెంచలయ్య ఉపాధ్యక్షునిగా, కె. సుబ్రమయ్య కార్యదర్శిగా, బి. ఆనంద రావు కోశాధికారిగా ఎన్నికయ్యారు. మరో నలుగురు డైరక్టర్లను కూడా ఎన్నుకొన్నారు. ఎన్నికలను కె. కృష్ణయ్య పర్యవేక్షించారు.



## అంగరక్షకుడు (9 పేజీ కొరవ)

చైతన్యానికి, న్యాయం, ధర్మం, సత్యం వీటన్నిటికి అతడు అంగరక్షకుడని చిత్రం ప్రతిధ్వనిస్తుంది.

కానిస్టేబుల్‌గా బ్రహ్మానందం, చిన్నపాపగా షామిలి కొంత హాస్యం అందించారు.

రాజశేఖర్ అంగరక్షకుడి పాత్రలో గొప్పగా నటించారు. తన తల్లితోను, పాప షామిలితోను కూడుకున్న దృశ్యాల్లో జీవించాడు. డాన్సుల్లోనూ దీటుగా దర్శనమిచ్చారు. ఇక ఫైటింగ్ సన్నివేశాల్లో ఒక మెరుపు మెరిశాడు. ముఖ్యమంత్రి కూతురుగా, అంగరక్షకుడి ప్రియురాలిగా మీనా చక్కగా నటించింది. షామిలి ఉన్న సీన్లలో సెంటిమెంటు, హాస్యంబాగా పండాయి. ఈ పాప చేత పెద్దపెద్ద మాటలు చెప్పించినా అదనప్రసంగి అనిపించుకోక ధీటుగా వినిపించాయి. డి.జి.పి. గా సత్యనారాయణ ఆ పాత్రను సులభంగా పోషించాడు. జె.వి. సోమయాజులు ముఖ్యమంత్రి పాత్రకు సరితూగాడు.

మరుధూరి రాజా మాటలు బాగున్నాయి. వేటూరి పాటల్లో లాలిపాట కీరవాణి సంగీతంలో మధురంగా వినిపించింది. విన్సెంట్ ఫోటోగ్రఫీని గురించి ఆఖరుగా ప్రస్తావించుకున్నా దాన్ని ప్రథమ స్థానంలో వుంచక తప్పదు.

## గోవిందా గోవింద (9 పేజీ కొరవ)

ముడుచుకొని రావడం చూస్తుంటే దర్శకుడు ప్రజలను ఎంత అమాయకులుగా భావిస్తున్నాడో తేటతెల్లమవుతుంది. సాంఘిక ధోరణిలో నడుస్తున్న కథలోకి అకస్మాత్తుగా గాలిలోంచి కర్రలు, శంఖు, సుదర్శన చక్రం రావడం దాన్ని హీరో చేత 'శివ చైన్'లా వుపయోగింప చేయడం దర్శకునికే చెల్లింది. తెరపై కథ త్రేతాయుగానికి, కలియుగానికి మధ్యన జరిగినట్లు చూపిన ఒకే ఒక సీన్ చాలాసేపటి వరకు ప్రేక్షకులకు అర్థం కాక జుట్టు పీక్కొంటారు. ఏమైతేనేం, హిట్ రేంజ్‌లో వున్న నాగార్జునను, టాలెంట్ వున్న ఆలిండియా టాప్ స్టార్ శ్రీదేవిని, నిర్మాత అశ్వనీదత్‌ను చివరికి సినిమా చూడను వెళ్లిన ప్రేక్షకుల చేత కూడా సీట్ల నుంచే గోవిందా... గోవింద అనిపించిన ఘనత రాంగోపాల్ వర్మకే దక్కింది.

ఇక కథ లోనికి వెళితే ఒక పక్క టాక్సీ నడుపుతూనే సినిమా హాల్ వద్ద బ్లాక్‌లో టిక్కట్లమ్మే శ్రీను (నాగార్జున)కు, బామ్మ (సూర్యకాంతం) ను స్వదేశం నుండి బ్యాంకాక్ తీసుకెళ్లను తిరుపతి వచ్చిన నవీన (శ్రీదేవి) తటస్థ పడుతుంది. పుణ్యక్షేత్రమంతా ఆమెకు తిప్పి చూపి తిరిగి పోయే సమయంలో కాశీ దారాలిచ్చి హృదయం పులకింపచేసి ఆమె మనసులో స్థానాన్ని సంపాదించేస్తాడు శ్రీను. బ్యాంకాక్‌లో వుండే చాంగ్ ముఠా ఒక మాంత్రికునితో చేసుకొన్న ప్రత్యేక ఒప్పందంలో భాగంగా వెంకటేశ్వర స్వామి కిరీటాన్ని కాజేయాలని భారతదేశం వస్తారు. వరప్ (వరప్ రావల్), స్వామి (కోట శ్రీనివాసరావు) సహాయంతో కిరీటాన్ని తెలిగ్గా కొట్టేస్తారు. దేవాలయం సెక్యూరిటీ విభాగంలో పనిచేసే హీరో తండ్రి నారాయణ (శ్రీధర్) దొంగతనం జరిగిన రోజు డ్యూటీకి రాకపోవడంపై అధికారులు అభియోగం మోపడంతో శ్రీను రంగంలోకి దిగిపోతారు. ప్రత్యేకాధికారి ( కెమెరామెన్ గోపాలరెడ్డి )తో కలసి బ్యాంకాక్ వెళ్లి కష్టాలు పడి నవీనతో కలసి ఫైట్లు చేసినా, చివరికి వెంకటేశ్వర స్వామి స్వయంగా రంగంలోకి దిగి సుదర్శన చక్రం ఇవ్వడంతో అది మాంత్రికునిపై ప్రయోగించి, సంహరించి కిరీటం తీసుకొని ఇండియాకు రావటంతో కథ సుఖాంతమవుతుంది.

రామ్‌గోపాల్ వర్మ, కొమ్మనాపల్లి గణపతిరావు కలసి రాసిన ఈ చచ్చు కథలో అక్కడక్కడా వర్మ బాణీ కనపడుతుంది. లార్డ్ రూంబాయ్ సీరియస్ యాక్షన్, లోయలో రక్షింపబడినప్పుడు శ్రీదేవి ప్రదర్శించిన ఫీలింగ్సు ఆకట్టుకొంటాయి.

వైకుంఠం సెట్‌లో కళాదర్శకుడు చలం ప్రతిభ, తిరుమల గాలిగోపురం నుండి అలిపిరి వరకు ఒకే ఒక లాంగ్‌షాట్‌లో చూపడంలో కెమెరామెన్లు విన్సెంట్ సోదరులు, గోపాల్ రెడ్డిల పనితనం కనపడుతుంది. వేటూరి, సీతారామ శాస్త్రి రాసిన పాటల్లో 'ఇందిర మందిర సుందర కారా', ఓ నవీన ఈ జగాన నీవేనా హసీనా, అందమా... అందమా విన సొంపుగా వుండేటట్లు రాజ్-కోటీలు చక్కని ట్యూనింగ్సు ఇచ్చారు. చిత్రంలో కన్నా బయట వినేందుకే ఈ పాటలు బాగున్నాయి. అందమా... అందమా పాటలో బ్యాక్ గ్రౌండ్ బ్యాంకాక్ అందాలు శ్రీదేవి ముందు ఫేడ్ అయ్యాయి. మనిషి దేవుడ్ని కాపాడమని వేడు కొంటుంటే, ఆ దేవుడ్ని కాపాడను మనిషి (సెక్యూరిటీ) కావల్సి రావడం విడ్డూరం వంటి మాటలు జంధ్యాల, వర్మ సలహా మేరకు రాసినట్లుంది. శ్రీదేవి, నాగార్జున వంటి స్టార్లను పెట్టుకొని కూడా వాళ్ల చేత యాక్షన్ చేయించలేక పోయాడు వర్మ. చిత్ర కథానాయకుడు నాగార్జున వెంకటేశ్వర స్వామే ఫస్ట్ హీరో అని చేతులు దులుపుకొన్నారు.

## సినిమా (9 పేజీ కొరవ)

అన్నపూర్ణ, సుమిత్ర, శ్రీధర్, మల్లికార్జునరావు ఇతర పాత్రధారులు. నిర్మాత: మాగంటి గోపినాథ్.

### మే నెల నుంచి తిరుపతి రెడ్డి చిత్రం

ఖైదీ వంటి సూపర్ హిట్ చిత్రాలను నిర్మించిన నెల్లూరీయుడు డాక్టర్ ఎం. తిరుపతి రెడ్డి మే నుంచి భారీ ఎత్తున నిర్మించే చిత్రానికి స్క్రిప్ట్ వర్క్ జరుగుతూంది.


జమీన్ రైతు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 100/- |
| అర్ధ సంవత్సర చందా | రూ. 50/- |
| విడిప్రతి రూ. 2.00 | |





నెల్లూరు వరి పరిశోధనా స్థానంలో జరిగిన కిసాన్ మేళాలో వ్యవసాయశాఖ కమీషనర్ జన్నత్ హుస్సేన్, ఎమ్మెల్యే సి.వి.శేషారెడ్డి, జక్కా రంగారెడ్డి, డాక్టర్ పి. రాఘవరెడ్డి; వరిపొలాలగట్లపై నిలబడి సేద్యపు తీరు ఆసక్తిగా అడిగి తెలుసుకుంటున్న మహిళలు

# ఇంత కుల ద్వేషం రెచ్చగొట్టడం సమంజసమా?

## కాన్షీరాం ఆలోచనలు విషతుల్యంగా వున్నాయి?

**సణుగుడు**

**డోలేంద్ర**

వర్తమాన భారత రాజకీయాలలో విస్మరించ వీలుకాని శక్తిగా ఎదిగిన నాయకుడు కాన్షీరాం ఆలోచనా రీతులు, ఉపన్యాస వైఖరులు అభ్యంతర కరంగా వున్నాయి; ఆందోళన కల్గిస్తున్నాయి. నూతన నినాదంతో, నూతన వర్గప్రజల ఆసరాగా అధికారం అందుకోవడానికి తాపత్రయ పడుతున్న ఈ నూతన రాజకీయ వాది భారత రాజకీయాలను, సమాజాన్ని ఏ రూపంలో ప్రభావితం చేస్తాడోనన్న సందేహం కల్గుతున్నది.

కాన్షీరాం ఒక స్వయం నిర్మిత వ్యక్తి, శక్తి! రాత్రికి రాత్రి నాయకుడిగా ఎదిగిన వాడు కాడాయన. ఏ తెలుగు దేశం పార్టీ వలెనో వెనుక నుంచి అదృష్టం తోసుకవస్తుంటే ఉద్రేకంగా, ఉన్మత్తంగా ప్రజాభిమాన ప్రవాహంలో కొట్టుక వచ్చిన పార్టీకాదు బిఎస్పి. ఉత్తర ప్రదేశ్‌లో ఈరోజు అధికారంలోకి వచ్చాడంటే దాని వెనుక పదిహేనేళ్ల కఠోర పరిశ్రమ వుంది; కృషి వుంది; ఓర్పు వుంది. దళితులకు సామాజికంగా జరుగుతున్న అన్యాయాలు చూసి, సహించలేక, మనసు రగిలిపోయి, హృదయం విచలితమై తన జీవితాన్ని దళిత జన ఐక్యతకు అంకితం చేసిన వ్యక్తి కాన్షీరాం. ఆయనలో అపూర్వమైన కార్యదీక్ష వుంది; లక్ష్య సిద్ధికి తగిన సహనం వుంది; గమ్యం చేరేందుకు ఎంతటి కంటకపు దారిలో ప్రయాణించేందుకైనా కావలసిన గుండె నిబ్బరం వుంది. అవి వుండ బట్టే వ్యక్తి గత సౌఖ్యాలు త్యాగం చేసి, ఉద్యోగం వదలిపెట్టి దళిత జన చైతన్యం కోసం ఉద్యమించాడు. ఏళ్ల తరబడి ఒంటరిగా హరిజన వాడల్లో తిరుగుతూ, భారతీయ చరిత్రలో దళితులకు జరిగిన, జరుగుతున్న సామాజిక, ఆర్థిక, రాజకీయ దురన్యాయాలను వివరించి చెప్పేవాడు. తన పర్యటనకు సైకిల్ వాడేవాడు. దళితులను ఐక్యం చేస్తే, వారిలో జాగృతి కల్గిస్తే ఏ నాటికైనా అధికారం తమ కైవశమౌతుందన్న ప్రగాఢ విశ్వాసం కాన్షీరాంలో వుంది. అందువల్లే మొదట మొదట ఎదురైన ఎన్నికల ఓటములను ఆయన లెక్క చేయలేదు. ఒకటిన్నర దశాబ్దం నిర్విరామ కృషి ఫలితంగా ఆయన నాయకత్వం, ఆయన పార్టీ నేడీ స్థితికి చేరుకున్నాయి. ఇదే పంతంతో, పట్టుదలతో పనిచేస్తే సమీప భవిష్యత్తు లోనే ఢిల్లీ సింహాసనం తన పరమౌతుందని కాన్షీరాం ఆశపడుతున్నాడు. దానికి తగినట్లే ఆంధ్ర, కర్ణాటక లలో ఆయనకు ప్రోత్సాహం లభిస్తున్నది. కాంగ్రెస్ బిజెపిల తర్వాత జాతీయ స్వరూపం కల్గిన ప్రధాన పార్టీగా బిఎస్పి గుర్తింప బడుతున్నది.

అభినంద నీయము, అబ్బురం కల్గించే విజయము ఇది. ఎప్పుడో కొన్ని వందలు, వేల తరాల నాడు ఆనాటి సామాజిక అవసరాల కోసం రూపు దిద్దుకొన్న కుల వ్యవస్థ రాను రాను అగ్ర వర్ణాలు చెప్పినట్లు ఆడే విష సర్పం వలె వికృత రూపం దాల్చింది. వృత్తి పరంగా ఏర్పడిన విభజన గతించి, పుట్టుకతో కులంగా పరిగణనకు వచ్చింది. స్వార్థ పరులు దీన్ని తమ కనుకూలంగా మల్చుకుని ఒక వర్గం ప్రజలను వందలేళ్ల పాటు అణచి పారవేశారు. అధమ కులాల వారనే పేరు పెట్టి వారి బ్రతుకును హీనం చేసేశారు.

ఈ దురన్యాయాన్ని సరిదిద్ద దానికి మహాత్మాగాంధీ వంటివారు కంకణం కట్టుకున్నారు. స్వాతంత్ర్యోద్యమంతో సమాంతరంగా అస్పృశ్యతా నివారణోద్యమం నడిపారు. అంబేద్కర్ వంటి మహనీయులు రిజర్వేషన్ల విధానం ద్వారా వారి సముద్ధరణకు బీజాలు వేశారు. ఈ నాలుగున్నర దశాబ్దాల కాలంలో వివిధ ప్రభుత్వాలు దళితుల సంక్షేమం కోసం తాము చేయగల్గిన దంతా చేశాయి. ఇప్పుడు కాన్షీరాం వారికి మరింత మెరుగైన సంఘ జీవనం, నాయకత్వం కల్పించేందుకు కృషి చేస్తానని చెప్తున్నాడు. అంత వరకు మంచిదే; ఆహ్వానించ దగినదే; ప్రోత్సహించ దగినదే!

కానీ ఆ పేరుతో ఆ లక్ష్యం కోసం కుల ద్వేషం రెచ్చగొట్ట వలసిన అవసరం వుందా? అది సమంజసమా? కాన్షీరాం గారి ఆలోచనా రీతులు కుల విద్వేషం ప్రేరేపించేవిగా వుండడం శోచనీయం. బ్రాహ్మణ విద్వేషం రెచ్చగొడ్తున్నారాయన. ఆయన దృష్టిలో బ్రాహ్మణులంటే అన్ని రకాల అగ్రకులాల వారూ వస్తారు. ఇన్నేళ్లు మీరు దళితుల్ని అణచివేశారు కాబట్టి, మేము అధికారంలోకి వస్తే మిమ్మల్ని అణచి పారేస్తాం అంటు న్నారాయన. తాము అధికారంలోకి రాగానే తమకు న్యాయంగా రావలసిన ఉద్యోగాలను తామే తీసేసుకుంటాం అంటున్నారాయన. అంత కంటె దారుణమైన వ్యాఖ్య ఏమిటంటే అగ్ర వర్ణాల మహిళల అణచివేత, వారిపై జరిగే అత్యాచారాల గురించి పట్టించుకునే ఓపిక తనకు లేదు. తమ మహిళల సంగతి వరకు తాముచూసుకుంటే చాలునన్నది. ఉత్తర ప్రదేశ్‌లో కులం పేరుతో అధికారులను వేధించడాన్ని ఆయన సమర్థిస్తున్నారు. ఆయన ప్రసంగాలు, ప్రకటనలు, వ్యాఖ్యలు, విమర్శలన్నీ అగ్రవర్ణ దురహంకారాన్ని నిరసించేవిగా కాక, అగ్ర వర్ణ విద్వేషాన్ని రెచ్చ గొట్టేవిగా వుండడమే ఆందోళన కల్గిస్తున్న విషయం.

దళితులు తమ స్వయం శక్తితో అధికారం తెచ్చుకొంటామంటె కాదనే వారెవరూ వుండడానికి లేదు; ఇంత కాలం అగ్రవర్ణాల వారు అధికారం పంచు కుంటె ఏ దళితుడూ అభ్యంతర పెట్టలేదు కదా? కాని అందుకు మార్గం కులాల మధ్య చిచ్చు పెట్టడం కాదు. రాజకీయంగా ఎవరికి బలం వుంటె వారికే అధికారం. కాన్షీరాం అధిక శాతం ప్రజలను ఆకర్షించి ఢిల్లీ సింహాసన మెక్క గల్గితే

కొరవ 7 పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press, OFFSET Printing at Navayuga Paper Products (India) Ltd.